# వైశాఖ మాహాత్మ్యము

కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి
ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

కొల్లూరు, గుంటూరు జిల్లా

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము

శ్రీరామ

## కాలభాగవతము—ద్వితీయస్కంధము

# వైశాఖమాహాత్మ్యము

## ప్రథమాశ్వాసము

శ్రీరమ్యం బొనరించుఁగాతఁ గమలాస్ఫీతాననోత్ఫుల్లక
ల్హారస్యందిమరందబిందురసపానాయత్తచిత్తాయత
స్మారాధ్యాధవషట్పదప్రవర మవ్యాజానుకంపారస
శ్రీ రాజిల్ల నెవేళ మాకృతిపతిన్ శ్రీ వేంకటేశాఖ్యునిన్

ఉ. ఓంకృతిపూర్వకమ్ముగ ననూనము భక్తి జపింతు సంతత
మ్మింక భవమ్ము నాఁ జను నహీనపయోనిధి, వేదవాక్కు లే
సంకటహర్తఁ జిన్మయుని సమ్మదరూపు నరూపు దివ్యుఁ జ
క్రాంకితహస్తుఁ బీతవసనాంచితరూపుఁగఁ దెల్పు నవ్విభున్

మ. ఘనతేజోమయుఁడై యమేయదయుఁడై గాయంబులన్
వేగ జీవునితోఁ దాను ననుప్రవిష్టుఁడయి వొల్పుం గాం
చఁగా నోచు నర్థిని నెవ్వాఁడు సమస్తజీవతతిబుద్ధిప్రేర
కత్వమ్మునం దనరున్ నిచ్చలుఁ గర్మకారకుఁడుగా
ధ్యానింతు వానిన్ మదిన్.

మ. అతుకం జాయతెఱంగు నద్దమున దేహాదర్శబింబులం
బ్రతిబింబించియె జీవభావమున సర్వప్రాణులం గర్మపద్ధతి
వర్తింపఁగఁజేయుచుం బెరసి తా ద్రష్టృత్వ మన్నింటికిన్
సతమున్ సాక్షిగ నొప్పు నప్పరము బ్రహ్మమున్ సహ్మస్తుఁ
జింతించెదన్.

మ. పురుషోత్తంసుఁ డెవాఁడు పూర్వము కృపాపూరంబు బహా
రంబుగాఁ బరమాత్మ్య మ్మను బ్రహ్మ మాదికవికిన్ స్పష్టంబు
గావించె నేయురుగాయుం దెలియంగ సూరిజను లె న్నొక్కెం
తయే నోప రప్పరమోదారుఁ బురాణపూరుషు మదిన్
భావించి సేవించెదన్.

చ. అరయఁ బవళ్ళు రాత్రు లుదయాస్తమయంబులఁ గూర్చు
చున్ దివాకరగతుఁడై యజస్రము జగమ్ముల నాయువుఁ
గొంచు ముంచు నేడ్తెర నెవఁ డొక్కమాఱ వసథిం బెది
నాథునుఁ గాలరూపుఁడై పరఁగు ననంతశక్తియుతుఁ బావను
నెంచెద భక్తియుక్తిమై.

ఉ. విశ్వము విశ్వమందుండు విశ్వము బీజము యోనియు నై యనాది
యై శాశ్వతమై చెలంగు శివశక్తియుగమ్మును గానఁ
దాసయై విశ్వమయుండున్నై విబుధబృందనుతుండయి బ్రహ్మ
వాచ్యుఁడై విశ్వగతుండున్నై యఖిలవిశ్వము లేలు మహాత్ము
నెంచెదన్.

మ. శివశక్తి ద్వితయాత్మకత్వ మెఱుఁగంజేయంగఁ గాఁబోలు
నాత్మ వనేజాయతనేత్ర యోర్తు మెఱయన్ వామమ్ము
భాగమ్ముగా భువనౌఘాఖ్యము నాట్యరంగమున స్త్రీపుం
వేషుఁడై తాన తాండవ మత్యద్భుత మాచరించు నగజా
నాథుండున్ ననోఁ మున్.

శా. గౌరీదేహమహాద్యుతుల్ మెఱుపులుం గంగాకనన్మంజు
మంజీరధ్వానము గర్జలై యెసఁగ నక్షీణానుకంపారసా
సారప్రీతి మొసర్చి పేర్చుత బుధస్వాంతాగ్నినాపాంగరా
ఢ్వారమ్మున్ రజతాద్రి నిల్చు భవవారాహమ్ము హేలా
గతిన్.

చ. ధరవరసందనీహృదయతామరసంబురసంబునన్ నిరం
తరమును దోఁగి మాఁగుటసుధామధురమ్మయి సంస్కృతిక్షుధా
భర మపఁగించి మించు భవభవ్యచరిత్రరసంబు పంబునా
దరమున శ్రోత్రపాత్రికలఁ ద్రావెడు భాగ్యము మాకుఁ
గల్గుతన్.

చ. పరమకృపాపరుండు సితవారిరుహప్రభవుండు వాఙ్మన
స్సరణి కగోచరుం డమలసత్పదవాచ్యుఁడు విశ్వసర్జన
స్థిరుఁడు నిరస్తసామ్యుఁడు శ్రుతిప్రభవప్రభవాత్మవర్తిగ
హ్వరుఁడు విధాత ప్రోచు ననయమ్మును మమ్మ నభీష్ట
దాతయై.

చ. అకలుషవృత్తి హత్తిఁ దిని యాకల ముగ్రవనమ్ములందు వా
రక తప మాచరించెడు నరప్రకరమ్ముల కీప్సితార్థముల్
సకలము లీయఁ దోయరుహసంభవుమధ్యముమాస్యమునందుఁ
బేర్చుకరుణమై జనిం గనిన రుద్రుఁడు భద్రము లిచ్చు
హెచ్చుగన్.

చ. అరయ నకార మాననము నౌ తుదిగాఁ గల వ్యంజనాసు
సువుల్ స్వరములు తాన యై మెఱసి వ్యంజనమండల
రూపుఁడౌ మహేశ్వరునకుఁ బల్కుఁ గల్పనముసల్పుచు
వేల్పులమ్రొక్కు లొందు నక్షర శివప్రాణనాడి శివ
సాఁకుత నన్నమృతత్వదాత్రియై.

ఉ. అక్షయ సాయకాసనగణాన్విత లాయతశౌర్యధుర్యలై
దక్షత వెంట నంట భయదల్ శతశక్తులు చండముండము
ఖ్యక్షణదాచరప్రకర మాజిఁ బొరిం బొరిఁగొన్న దుర్గ
సంరక్ష యొనర్చుఁ గావుతఁ జిరమ్ముగ మమ్మనుకంప
పెంపునన్.

ఉ. ఏయమ లేక లే దిరవుఁ బొందుచు బెంపును మర్త్యకోటి కెం
దేయమ కన్నుసన్నలఁ జరించు జగమ్ములు కీలుబొమ్మలై
యేయమ విష్ణువక్షమున నింపెసలారి వసించి మించు నె
స్డాయమరాదివంద్య కమలాలయ మాకు నభీష్ట
మిచ్చుతన్.

మ. కనఁ బల్కుల్ దొలిపల్కు లంగలత యోంకారమ్ము,
నంగమ్ములే కనదంగమ్ములు, ప్రాణముల్ స్వర, మలంకార
మ్మలంకారముల్, ఘనసాహిత్యము కట్టుపుట్ట మవుచుం
గ్రాలం ద్రయీమాతయై ఘనతం గాంచు వచోవధూటి
సతముం గాపాడుతన్ సత్కృపన్.

చ. పలుకులఁ గుల్కులన్ సరసఁ బయ్యెటమాప్పుల మొల్క
నవ్వులన్ వలదొరతూఁపులం గెలువఁ బర్వెడు కన్బొమ
తీరులం బిఱుందులదుగ మేల్పసందుల మనోజరిపుం గికురించి
మించి వేల్పులనుతిఁ గన్న యాభువనమోహిని మోహ
మెడల్చి పొల్చుతన్.

మ. మొనకాఁడై ఘనమంత్రమూర్తియయి, శంభుస్ఫారజూటీ
జటాజనితుండై, శివ కెగ్గు సేసి క్రతుదీక్షాదక్షుఁడౌ దక్షు
నెమ్మన మల్కం దలక్రిందుగాఁ దునిమి తన్మస్తమ్ము
హవోమాగ్ని ప్రేల్చిన భద్రాఖ్యుఁ డనిద్రభద్రములఁ జాళిం
గూర్చుఁ జేర్చుం గృపన్.

మ. బలవద్విఘ్నపరంపరాహ్వయము దుర్ధాంత మ్మసంతస్సుగా
నలమం జేవ దొలంగి చేయిడినకృత్య మ్మెల్ల ధ్వస్తమ్మై
పోలివ్రాకుండ ఫలమ్ము నీదొడర సంపూర్ణమ్ము కారుణ్య
ముం దొలిపూజల్ గొనుసామి తా మదిని నోంపంగాక
నాపై దయన్.

చ. పరఁగ దెలంతు నింతయని పల్కఁగరాని సుభక్తియుక్తి
నిర్జరవరు జాతవేదసుని సంయమనీవిభు నాశరేశు న
వ్వరుణుఁ బృషత్తురంగు నిధిపాలకు ద్ర్యంబకు విష్టపావన
స్థిరముల నన్యదైవతవిశేషములన్ మదభీష్టసిద్ధికై.

ఉ. అంతకసన్నిభుండవు దశాస్యుఁడు ప్రుచ్చిలిపోయి సీతయా
పూరంతరమందు డాచిన ధరాత్మజసేమవుచున్కి దాఁటె
దుర్ధాంతము వార్ధి రామవసుధాపతి కెవ్వఁ డెఱుఁగఁ జేసె
నత్యంతము భక్తి నెంతు మది నాహనుమంతు ననంతుఁ
జేరిమిన్

క. అలసు లహంకృతియుక్తులు
కలిమర్త్యులు దీనిఁ దెలియఁగా రారని ప్రాఁ
బలుకుల మోపును గారా
మలరఁగ విభజించి మించు వ్యాసు స్మరింతున్.

చ. చెనయ నసామ్య మజ్ఞజనచిత్తగుహాంతరభూము లావరిం
చినయనభిజ్ఞతాతమము, శిష్టసరద్భవదావపావక

మ్మను ఘనబోధనద్యుతులఁ బోల్చు కృపారసవృష్టి నష్టముం
బొనరిచి ఖ్యాతిఁ గన్న గురుముఖ్యుల నెంచెద శంకరాహ్వులన్.

క. ఘను సంస్తవసనంతా
ననిలింపత్మ్మజరాజు సంద్యయశస్స్ఫీ
తుని విశ్వనాథసూరిం
ద్రుని మత్సాహిత్యగురుని దొడరి తెలంతున్.

తే. అలర ఛందోనిబద్ధమ్ము సులలితమ్ము
హృద్యపద్యముం గూరుచువద్యపద్యఁ
దెలిపి కవిలోక మేలిన దివ్యమూర్తి
యాదికవి యగ్గమా మాహృధ్యానవిధికి.

క. అరయన్ ధ్వనిరూపమ్మున
నరచరితము నెఱుకపఱచు నలచరితమ్మున్
సరసత నిర్మించిన కవి
వరుఁడా శ్రీహర్షుఁ డనిశవంద్యుఁడ కాఁడే.

తే. అతిగభీరగీర్వాణభాషాంబురాశిఁ
గావ్యతీర్థవినిర్మాణకలన శిశువు
ఖావగాహ మొసర్చిన యర్చ్యపసుఁడు
కాళిదాసుఁ డుపాస్యుఁడౌఁగాక మాకు.

క. వీణావేణుత్కారని
క్వాణమ్ముల గెలుచునుడులఁ గవితాపదని

శ్రేణుల్ కావ్యశ్రేణుల్
రాణం గూర్చినఘనులఁ దెలఁతు నెల్లఱ నేన్.

చ. పలుకు వెలంది యేఘనులప్రాక్తనపూరుష వేష మూని యి
మ్ములఁ గవితామృతధ్వనులు భూషణరావముగా బుధాళి
హృజ్జలరుహరత్నవేదిపయిఁ జల్వ ముదంబున నర్తనంబు
వారలఁ బొగడంగ నెవ్విధిఁ దరంబగు నన్నయతిక్క-
నాదులన్.

చ. సొరిది సువర్ణరూపములు శోభననాయకచిహ్నితంబులై
స్ఫురదమలోజ్జ్వలత్వపరిపూర్ణములున్ ధ్వనియుక్తముల్
మనోహరములు నౌ నిబంధముల హృద్గతిపులం గయిసేసి
వాసిమైఁ బరఁగిన పెద్దనాదికవివర్యు లలంతులై చేరిమిం
గవుల్.

మ. అతులంబై శతపర్వక్లృప్తమయి భవ్యార్థప్రదంబైన భా
రతమామ్నాయము పంచమమ్ము సుకవివ్రాతమ్ము ప్రీతమ్ము
గాఁ జతురత్వమునఁ దెన్గుసేతకు జనిన్ హృన్మండలిం
గన్న శ్రీయుతు శ్రీపాదకవీంద్రచంద్రము నయ మ్మొప్పారఁ
గీర్తించెదన్.

ఉ. తాపసగణ్యుఁ డీడ్యకవితాపిత వేదశిరోర్థవేత్త యా
ర్యాపతిమూర్తిరూప మల రామకథామృతకర్త ప్రోఁడ

తాఁ దేపలిపాఠశక్తిని ఫలించినముత్యము వాగ్విలాసభా
షాపతి వేంకటప్పకవిచంద్రు నుతించెద నంచితస్థితిన్.

చ. సురుచిరవాగ్విలాసము సుశోభనవృత్తు లలంకృతుల్ మనో
హరపదసంస్థితిన్ గడు నొయారము మీఱు నడంత భావ
సుందరహాసితమ్ము లాంధ్రకవితాలలితాంగికిఁ గూర్చినట్టి శ్రీ
తిరుపతివేంకటేశకవిధీరుల నెంతు ననంత మాస్థతోన్.

తే. కంకటిం గూలఁ గంకంటికవినిబంధ
ముత్తరముకాండమును దెనుఁ గొసరఁ జేసి
వాసి నెనసిన కవితావిలాసు నమల
యశుని రాఘవనారాయణాఖ్యు నెంతు.

మ. ఎటులుం గాకయ యున్నఁ గ్రన్నఁ గయికోయిన్ మోడ్చి
సుప్రీత హృత్పుటులం జల్పఁగ నొప్పు సత్పురుషులన్
ధూర్తౌఘపున్మాట సన్నిటలాంకుండ పరిష్కరింపఁ
దలఁపన్ నే వారిదా నూస యెప్పటికే ష్ఫుర్వాన దొర్లు పంది
సదిలింపం బోమి యే సేమమా.

వ. అని సకలదేవతాప్రార్థనంబును గురువందనంబును గీర్వా
ణాంధ్రకవిప్రవరస్మరణంబును గావించి నించినకెలసంబున
నే మిహాపరఫలప్రదం బగు నిబంధ మ్మొకఁ డల్లఁ బల్లవి
తావధానులమై యుండ నొక్కనాఁడు

మ. అనుఁగుందంఁడ్రియుఁ బ్రాజ్యవైభవులు స్వీయభ్రాతలున్
బాత్రమిత్రనికాయంబును గూర్చువిందులుఁ గసింప్రపస్తోమ
మున్ సీమ మించినహర్షాంబుధి నోలలాడఁ గమునాసిం
దాయి శ్రీవేంకటేశనరోత్తంసుఁడు స్వీయమహాత్మ్యమున స
త్సంలాపలోలాత్ముఁడై.

వ. తనరుచు

మ. సరసోత్తంసుల సద్విధేయులఁ గవీట్సమ్మాన్యులన్ గూర్చు
సోదరులన్ మమ్ములఁ బిల్వనంపి, కనినంతం జేర్మికల్మిన్
నమస్కరణాద్యర్చలఁ బ్రీతులం జలిపి, యగ్ర మ్మాసన
మ్మిచ్చి యీసరణిం దా వచియించె నించునృదువాక్సా
రంబు తోరంబుగాన్.

మ. ఎన యేడం గనరానినేత్రమున నిల్లైన్నేళ్ళనో యుండి
నిండినప్రీతిన్ మన మొందుచుంటి మది పున్నెంపున్ విశే
షంబ; యందును జ్యోతిర్విదులాట మీరు కయినాదోషమున్
గదున్ నాకు నె; ప్డనువౌ నేస్తి లభించు టొక్కటియె
భాగ్యం బుర్వి నెవ్వారికిన్.

వ. అది యటులుండె

ఆ. మెచ్చ నుభయకవులు మేలిక్రొంజవుల నూ
రించు పలుకులన్ రచించి కృతులు
మివుల యశము గాంచి మించుచుండుట మీర
లొందుచుండు గరువ ముసుగ కేను.

తే. అమలసుమనోమనోహరమైన తెనుఁగు
కయితపేరిటిపువుదోఁటఁ గడలు పదియు
గుమగుమాయింపనొసరుచు సుమపరీమ
ళములు మీభవ్యకావ్యరాజములు నిజము.

తే. కూర్చినది. కూర్చినట్టులు క్రొత్తక్రొత్త
కృతులఁ జవులూరఁ జెప్పుల కాదృతిని మీరు
వినుచునపుడెల్ల నుబలాట మెసయు నాదు
స్వాంత మెంతయుఁ గృతిపతిత్వమునఁ దనర.

తే. ప్రథితభావవైభవములు ధ్వనులునాఁగ
కంకణక్వణనము లొప్పఁగా సువర్ణ
మహిత సత్కృతి పేరియుగ్మలికిఁ గూర్చు
పతియ యనువాఁడకద కృతి క్షితిఁ దలంప.

తే. కులము శీలమ్ము గొనములు కలిమికలిమి
నూరుపేరులు నారవితారకముగ
నిలువఁ జెలువునసమ్ము నిశ్చలత గాన
మాచరించు సత్కృతియన్న యన్నుమిన్న.

తే. ఇహపరార్థసాధనములై యొసక మొసఁగు
సప్తసంతానములలోన సరసతరము
కృతిని గొనుట దొక్కఁడ గాంచు శ్రేష్ఠవృత్తి
నంచు వచియించి రంచితు లరసి యరసి.

వ. కావున

క. మనయొరులోరులపయిం గల
ఘనతర మభిమానమునకుఁ గ్లాంతిం గసనే
అని గాటపునేస్తమునకు
ననుకూలముగాఁగ మదభిధాంకితమును గాన్.

వ. మృదుమధురార్థవచస్సందర్భంబుగ భావబంధురంబప్ర
నిబంధ మ్మొకఁడు నర్మిలి నిర్మింపుఁడని వేఁడిన వేఁడుక
దళుకొత్త ముదాయత్తమ్ములయి చిత్తమ్ములు మస్తకమ్ములు
గా నేమును నామిత్రగ్రామణికి ట్లంటిమి.

తే. పరమకరుణాపరుఁడు పరాత్పరునికరుణ
చే లభించినకైత కాంచెను ననుంగు
కూర్చుకోరికి ముదమారఁ దీర్చునియతి
యువని నిట్టిద కాదె ధన్యత్వకలన.

తే. ప్రవిమలార్థబంధురము నిబంధ మొకఁడు
మీరు పలికిన పోలుపున నారచించి
మించునరుసము ననమును గాంచువార
మఖిలసుకవిజనమ్ములు నాత్మ మెచ్చ.

వ. అయ్యదియు యత్ప్రతిపాదకంబై డంబు వహింపంజను?
మీతలం పెఱింగింపుం డనిన నన్నరోత్తంసుం డిట్లనియె.

తే. చూచుచుండఁగ వింతయై తోఁచుఁ గ్రొత్త
క్రొత్తఘటనల ఘటియించి రూపరింప
నలఁతియే కాని మహిమమ్ము వెలయ నఖిల
మూలమౌ కాలము నెఱుంగఁజాలు నెవఁడు!

వ. అదియు రెప్పపాటు మొదలుగఁ జైత్రవైశాఖాదికమాసర్తుప్రభవప్రముఖ వత్సరసాహస్ర పరిమితయుగమహాయుగాదులఁ బరిగణింపంబడుచు సర్వప్రేరకంబై యఖిలక్రియాకారకంబై తత్కర్తల కాయాసమయంబుల కనుగుణంబులు ఫలంబు లొసంగుచు ననంతవిభవంబై యెసంగుంగదా! అందును నపుడపుడు ప్రక్షపితాశేషకల్మషులును శ్రీహరిచరణసరోజద్వయసమర్పితసర్వస్వులును సముజ్జ్వలయశస్వులును వీతవిషయపాశావాప్తిసంభావనులును భావనులును లోకోత్తరచరిత్రులును మహాభాగులు నరాగులు నయి చైత్రాదికద్వాదశమాసంబులం జనించి నించినభాగ్యంబున నఖండసుఖం బెనసిన భాగవతోత్తముల విభవంబు లామూలాగ్రంబుగ విన మనమ్మున నెసే ననయమ్ము గుతుకమొందుచునుండు నందులకుం దగినచందమ్మున

మ. కవిలోకాగ్రణి తాడెపల్లికులరాకాకైరవాప్తుండు రా
ఘవనారాయణశాస్త్రివర్యుని కనత్కారుణ్యపుంగల్మిఁ దో
ల్త వినంగల్గితిఁ జైత్రమాసముమహత్త్వమ్మెల్ల నానాఁటిభా

గవత్రవాతముపూతగాథయును వీఁకం బాపముల్ రూ
పఱన్.

తే. పరమశంకరమాధవావసరమందు
మాధవకృపాకటాక్షసంభావితు లయి
భావములరార సుఖలబ్ధి వఱలు పావ
నశ్రవసులు మాధవులు ధన్యత్వఘనులు.

క. అవ్వారలయురుచరితము
లెవ్వేళల నాదృతి సునిహితచిత్తుండై
యెవ్వాఁ డాలింపంగలఁ
డవ్వాఁ డిష్టమ్ము లందు నంద్రు మహాత్ముల్.

క. కావున మధూత్తరార్ధ
మ్మౌ వైశాఖాఖ్యమాసమహత్త్వ మనమ మి
ష్టే వినఁ గౌతుక మయ్యెన్
వేవేగ రచింపుఁ డనుచు విలసిలుప్రీతిన్.

చ. కృతివనితావతంసముచిగిర్చినలేనవుసౌరు మీఱు వె
ల్లతములపాకు, లాయమతలంపులఁ బోలిన మేలిపోఁక, లా
సతికపురంపువీడియముజాల్కొనుకమ్మనితావి నోప్పు న
ప్రతనము లేలకాదులు సువస్తువులుం దగ వీడె మిచ్చినన్

వ. వల్లెయని కొని తదనుమతి నిజావాసమ్మున కరుదెంచి
యనుంగుకోరినకోరికకుం గడుంగడు నలరుచు నంతను

మున్న వైశాఖస్కంధసంగ్రథనంబునకుం జైత్రస్కంధ నిర్మాతయును రాఘవనారాయణసుధీవరునిచే నియమితు లమైయుంట నినుమడించినయుత్సాహమ్మున నవైశాఖ మాస మాహాత్మ్యాంధ్రీకరణమ్మునకుం గడంగితి మింకఁ గృతిపతివంశక్రమం బెట్టిదనిన—

కృతిపతివంశవర్ణనము

మ. సరసంబుల్ హరిదంతసంగతయశస్సారభ్యసంచారముల్
పరమంబుల్ శతపత్రపత్రఘనముల్ భవ్యార్థ్యముల్ మిత్ర
సత్కారసంస్పర్శకుతూహలమ్ములు ననిద్రాణప్రభావమ్ము లీ
ధరణిం దామరతంపరై పరఁగుతం దాయ్యన్వయాంభోజ
ముల్.

క. నెలవులు శౌర్యస్థైర్య
మ్ముల కలఘులు కలితధర్మభూషణపాణుల్
విలసిలిరి ద్విజేతరకుల
జు లిలాంకుశలానుకూలశుభవృత్తిఁ దొలిన్.

తే. కెలఁకు లీరైన మార్మ్రోయు నలముకొనిన
భవ్య మామేటిబిరుదుల నవ్యకీర్తి
గీతికారవళి స్ఫురించు నాతతముగఁ
గవికుమారుల వాక్తరంగములగుముల.

తే. ఆకాలమ్మున నిమ్మవు నంద< జేరు
వారి కడ<గండ్ల నడ<చి యపారమైన
కూరిమిం బ్రోచు వడగండ్ల గోత్ర మఖిల
వరకవివ్రాతసంస్తోత్రపాత్ర మొక<డు.

తే. చాయ< గూరుచు నొతయు< దాయిపేర
నేపుమీఱెడు నుపనామ మాపవిత్ర
గోత్రరాజమ్మునకు గిరికొన్న పేర్మి
జాళువాపసి<డికి వోలె మేలివలపు.

తే. యాచకాభీష్టఫలదాయి యాచు< దాయి
వంశ ముచ్చైశ్రవమ్ము దిగ్వలయమందు
నొంద< జొదె ననూయ బుధోత్కరమ్ము
సురభిసురతరువర్ణనస్ఫురణకలన.

తే. వార లారయ మాకృతిపతికులమ్ము
పేరిరత్నాకరమునకు< గైరవాప్తు
లాప్తవిపులవైభవులు భవానుకంప<
బెంపుమీఱినపేరిమి వెలయువారు.

క. శ్రీసంధ్యాయశోభరస
మ్మానితవిభవుండు ధర్మమార్గాభినివే
శానంతుం డలరు< ల
క్ష్మీనారాయణు< డవారికిం దొలివిత్తై.

క. ఆయనఘుఁడు లక్ష్మీనా
రాయణుఁడే యవును సుజనసంతోషాదీ
ద్యాయతగుణముల శ్రీసము
దాయార్చిత జాయ మంగతాయారమ యా.

క. అమ్మానవతీకులతిల
క మ్మన్నిటఁ దోడునీడగాఁ గనె స్వసమ
మ్మమ్మహితుఁడు పురుషాప
త్యమ్మును రామానుజాఖ్య ధన్యతఁ గూర్పన్.

మ. అనుభూతోన్నత వైభవాఢ్య సఘవ్యాపారపారంగతున్
ఘను రామానుజు మానవప్రవరు నానంద మ్మమందమ్ము
గాఁ గొని యాత్మేశునిఁగా మృగాక్షి విలసత్కుందప్ర
సూనాభ శ్రీజనతారత్నము మీనమాంబిక కనెన్ సౌఖ్యం
బలేఖ్యంబు తాన్.

గీ. అమ్మహాసాధ్వి మీనమాఖ్యాన పరమ
పదము నెనసిన వెనుక సద్విదితవిభవ
శాలి రెండవునింతి వరాలదొంతి
యవు యశోదపేరిటి సుగుణాఢ్యయందు

తే. కాంచె సుబ్బరాయాఖ్యు సమంచితశ్రే
వోనిధాను నిలాత్మజాజానిచరణ

నలినయుగలార్చనావిధానసుదృఢావ
ధాను శ్రీజగన్నాథరాయానుజన్ము.

తే. లలి నఖిలకలాపూర్ణతాకలన నలరి
యమ్మహామహుఁడు నిజాస్వయమున కెంతొ
వాసియుఁ, వన్నె, నిజజనవర్గమున క
మంద మాహ్లాదముం గూర్చెఁ జందురుఁడనఁగ.

సీ. తననిరంతరదానధారేయతకు రాధ
కొడుకు కొకమాద్రి కాఁగలఁడు జోఁడు;
తనయశస్ఫూర్తి కీడని వాకొనం జను
విధుఁడు లోఁ గఱిడాలు వెలయుచున్నఁ;
దనమహైశ్వర్యభాక్త్వమునకు నింద్రుఁడు
ప్రతిముఁడో గొంత నిర్మదుఁడయ్యెనిఁ:
దనవాగ్విలాసమ్ముఘనతకుఁ బెనుచిల్వ
సామి తరమ్మవు సామ్య మున్న;
నహహా, ప్రజ్ఞాసురాచార్యుఁ డార్యసంధ్య
చరితమహితుఁ డం చనసూయుజనులమన్న
నలకు భాజనమ్మయి కడు నలుప్రమీఱు
సుబ్బరాయాఖ్యనృకులాబ్ధిసోముఁ డెపుడు.

గీ. తనర నయ్యర్థికల్పకమ్మను దలిర్చు
నూతగఁ గొని శాలీనతాస్థితవృత్తి

హ_త్త నుచ్చైశ్శ్రవోభవనాధిరోహ
ణాభిరతి నెసకమెసఁగె నమృతవల్లి.

తే. యాచమానమానసపూరణాదికములఁ
గల్పవల్లీమతల్లియై గణుతిఁగాంచు
నమృతవల్లికి నామోద మట్లు పసిఁడి
కదికెఁ దుదిని దాయారమపదము ఘనము.

తే. అన్నముం బెట్టు నతిథుల కన్నపూర్ణ
సరణి, ననుగమించును ధవుఁ జాయచాయఁ,
బలుకుఁ బలుకుపల్కున సుధ తొలకరింప
సుబ్బరాయాఖ్యగరిత సంశుద్ధచరిత.

తే. వఱలునీలువునన్ సత్యవంతునింతి,
ఊమను బాటవలంతి, చక్కఁదనమ్ము
నందు మరుబంతి, సుబ్బరాయాఖ్యనింతి
యిసుటయేగాని యెఱుఁగఁబో దిడుగ డింత.

సీ. సరివచ్చు నొకయింత సర్వమంగళ తా మ
గనిసాముమే న్గోసి కొసక యున్నఁ;
బురుఁ డవు నొకపాటి సరిదీశుసుత పతి
వెడఁదఱొమ్మున విట్టివీగకున్నఁ;
బోలు నించుక వాణి సోనాడి గల్ప్రీసఁ
బనుగురనోటఁ దాఁ బడకయున్న;

నవ తనఁ జను సుంత శచి శాశ్వతము కాని
భోగభాగ్యమ్ముల మురియకున్న;
నన్నకవిసన్నుతుల కిరవై తలిర్చు
పుల్లహల్లకనిష్యందిసల్లలితము
రందబిందుబృందసుమధురతరవచన,
యర్థిజనకల్పవల్లి, (శ్రీ) యమృతవల్లి.

ఆ. అమ్మహాపతివ్రతావతంసమ్ము నం
దమ్మహామహుండు సమ్మదమ్ము
చివురుదొడుగఁ బడసె శ్రీవేంకటేశాఖ్య
ఘనయశస్కుఁ దొలిద కాన్పు గాఁగ.

క. ఆయీడ్యుఁడు పదఁపడి నా
రాయణునిన్ సత్యపూర్వు, నభిరామగుణున్,
శ్రీయుతుని రామమూర్తిని,
దాయారమయందుఁ గాంచెఁ దమి యెసఁగఁ; బిదపన్,

క. ఆలోకోత్తరచరితుం
డాలీలం గాంచె సద్గుణాంచితల యశో
దాలక్ష్మీదేవ్యాఖ్యల
బాలామణులం గొలమ్ము ప్రథితి గనంగన్.

తే. ఆనెటిని మహాత్తేజు రామానుజాఖ్యు,
దివ్యలక్షణలక్షితు భవ్యచరితు

లక్ష్మణస్వామి, నామీఁద లబ్ధవిభవు
నాంజనేయునిఁ గనె నన్వయ మ్మిమ్మిరుర్వ.

క. తొలికాన్పు వేంకటేశ్వరుఁ
డలఘుధిషణుఁ డలఁతిప్రాయమందె గడించెన్
లలిఁ గల సర్వరహస్యం
బులు దా నాంగ్లమున రాజపూజ్యత గదురన్.

ఆ. కోరి యేని నొరుల ప్రేరణమ్మున నేని
నెట్టి యెడలఁ గాలు వెట్టిగాని
ధర్మపథము నింత దాఁటఁజూడఁ డెన్నఁడు.
సరసవచనుఁ డమలచరితుఁ డతఁడు.

క. ప్రమదాజనరత్నము ర
త్నమ పేరిటివారిజాస్య తన కూర్చు కళ
త్రముగాఁ బాత్ర మ్మయి సౌ
ఖ్య మలేఖ్యమ్మున కతండు గణనీయుండౌ.

క. సంతతసంతుష్టనిజ
స్వాంతుఁ డనంతశ్రేష్ఠుఁడు సుసంతానుఁ డతం
డింతంతకానితమి న
క్లాంతసుగుణ మాదుకృతికిఁ గాంతుం డయ్యెన్.

తే. సర్వరక్షాసుదీక్షితుఁ డుర్వరాసు
తామనోంబుజభ్రమర మా రామచంద్రుఁ

డెనయుదయ నేతదన్వయ మేలుఁగాత
నాయురారోగ్యవిభవసమన్వితముగ.

కృతికర్తృవంశవర్ణనము

శా. శ్రీనారాయణసేవ్యభవ్యపదరాజీవుండు భావాలిగా
నూనప్రాభవుఁ డప్పిభాకరనృసింహాభిన్నభద్రానుసం
ధానస్ఫీతుఁడు పూతమూర్తి త్రిపురానాథుండు కారుణ్య ను
క్షీణ మ్మొప్పఁగ నాగభూషణుఁడు సుశ్రేయమ్ము నా
కిచ్చుతన్.

సీ. వఱలు వెల్నాట శ్రీవత్ససగోత్రాఢ్య
వైదికబ్రాహ్మణాన్వయము తప్పి
భవు లాగమాంతోరుభావవినిర్ణయ
ప్రవణు లందును మహాప్రౌఢిఁ గాంచి
భూరియశుల్ కూచిభొట్లోపనామకు
లవ్వారిలోనఁ జిదంబరసుధి
ప్రథితి నొందె మహత్ప్రభావవిభవుఁడయి
యాబుధార్చ్యుఁడు కోటమాంబయందుఁ
గనియెఁ గృష్ణయ, సుబ్బయాఖ్యలఁ దలిర్పు
ననుఁగుఁగొమరుల నిరువుర. నం దమంద
వాగ్విలాసుఁడు సుబ్బయ ప్రథమజాయ
త్రిపురసుందరియందుఁ జేరిమి చివుర్ప.

తే. కనె మనీషి నశేషసద్గుణవిశేష
భూషణుఁ నాగభూషణుఁ బుత్త్రివరుని;
బెరయుదమి రెంటపృపడంతి నరసమాంబ
యందుఁ గాంచె శ్రీరాముఁ గలాభిరాము.

తే. నాఁడు నేఁడును నొకజాడ నాగభూష
ణుండు త్రిపురాంబికాసనాథుండ యవుచు
నలరె నస్మజ్జనకుఁడుగా నట్టిదకద
స్వీయవత్సలత్వమ్మునా వెలయునద్ధి.

గీ. మాకొలమ్ము తల్లి మాకుఁ దల్లియ కాక
యెల్లలోకములకుఁ దల్లియైత
నర్చిన త్రిపురాంబ నాగభూషణుతోడ
మాకుఁ బూజ్యపాద గాకయున్నె!

క. ఆయిూదృగ్వుఁడు కాంచెన్ సు
శ్రేయోమహిత మహిత రహిఁ ద్రిపురాంబన్, నా
రాయణుని, ప్రభాకరు, నన
నూయును లక్ష్మీనృసింహు, సుబ్రహ్మణ్యున్.

వ. మఱియు

తే. కలితసర్వసులక్షణ కపుఁగిలికృతి
నేత్రి రామసీతాహ్వయపుత్రి, వీర

రాఘవాఖ్యాను, షట్పదరమ్యకుంత
లన్ శకుంతలం గనియెఁ జూల్గాఁగఁ బడిన.

తే. తనరె లక్ష్మీనృసింహాండు దత్తుఁడైన
కతన ఘుట్టుపనామసంకలితుఁ డవుచుఁ.
గూర్చు నేకోదరులము తలిర్చుచుతన
మొనర దొరకొంటి మిద్దాని దెనుఁగుసేయ.

షష్ఠ్యంతములు

క. ఆతతగుణరత్నగణ
స్ఫీతునకతిశయితధీవిశేషోల్లాసో
పేతునకఖిలకలాని
ష్ణాతునకతిమృదువచనరచనాచతురునకున్.

క. మిత్రమనస్సారసవర
మిత్రునకబలాజనౌఘమీనాంకునకున్
శ్రోత్రమహఃప్రాయసుచా
రిత్రపవిత్రునకు గుణికి శ్రీమహితునకున్.

క. సారాచారవిచారవి
శారదునకు శారదాంబుజజ్యోత్స్నాసన్న
కారసదమలయశోవి
స్ఫారునకుం దాయివంశజలధివిధునకున్.

క. సరసోత్తంసునకుం బ్రస్ఫు
   రరమహితసహస్సునకు రమామహిళామే
   దురకరుణాసంపాదిత
   గురువిభవునకు వడగండ్లగోత్రభవునకున్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాకడంగిన వైశాఖమాస
   మాహాత్మ్యంబ్రకటీకరణమ్మున కుపక్రమక్రమ మ్మెట్టిదనిన—

కథాప్రారంభము

సీ. శ్రీదమౌ నైమిశక్షేత్రరాజమ్మున
   లోకమంగళసమాలోచనప్ర
   వణు లగణ్యులు మహామునివరేణ్యులు బహు
   వార్షికసత్రనిర్వహణపరతఁ
   బరఁగుచు నొకనాఁటిమరుణోదయము వేళ
   హుతవీతిహోత్రులై యున్నతఱిని
   సగుబెంచిన సమంచితాత్ముఁ బురాణసు
   సంహితావ్యాఖ్యానచాతురీస
   మేతు సూతుని నెదురేగి ప్రీతి నర్ఘ్య
   పాద్యవిధులఁ గొలిచి కొనివచ్చి యున్న
   తాసనాసీనుఁ జేసినయవల నిట్లు
   లనియె ముని శౌనకాఖ్యుఁ డయ్యనఘమతికి.

తే. మానిసత్తమ, మంగళాఖ్యాన, ధీస
మేత, సూత! వచింపుము పూత మస్మ
ముఖము చైత్రమాసమ్మునపూర్వమహిమ
మెల్లఁ జెల్ల మాదురితము లిపుడ మాకు.

వ. అని వేఁడిన సముదానందకందళితహృదయుఁడై వినయావనతుం
డవుచు నమ్మునికులతిలకుండును నయ్యాదిమమాసమాహా
త్మ్యమ్ము సాంతమ్ముగ నెఱిఁగించిన విని సంతసించి శౌనకము
నీంద్రుం డిట్లనియె—

తే. సూత, వ్యాసోక్తిసారసుస్నాత! తావ
కీనకరుణానిధానతాక్లృప్తిఁ జవులు
జెవులకుం గొల్ప వింటిమి భువననేత్రు
నతిపవిత్రచరిత్రము లడఁగె భవము.

క. కాదనక మాదుప్రశ్నము
యాదవవంశాబ్ధిసోమునమ్మతచరితన్
శ్రీదము ప్రతిపద మమృతర
సోదయముగ నుడివి తనరి తురుతరకీర్తి!

క. జగదానందకరమ్ములు
జగదవననిరంతరుండు జలధరరుచిరాం
గుగుణగణవిభవములు విని
నెగడంజన రెవ్వ రాప్తనిర్వృతు లవుచున్!

క. సతతశ్రావ్యము భక్తజ
నతాగతిద మయిన నందనుదనుకత నీ
గతి నెన్నాళులు వినినం
జతురమతీ! తనివి గనవు స్వాంతము లింతేన్.

క. ఆవేదశిరోవేద్యుని
పావనమహిమమ్ము లింకఁ బల్కుము విన మా
భావమ్ములు కౌతుకసం
భావితము లవుచు నెలర్చు, వారనికరుణన్.

తే. అయ్యురుశ్రేష్ఠమహితమహాత్మ్యమును స
విస్తరమ్ముగఁ దెల్పు మోవేదవిద్గ
ణాగ్రణీ! వ్రతదానార్హణాదికముల
గరిమ వివరింపవలయు వాగ్గరిమ గదుర.

తే. ఎవ్వఁ డెవ్వేళ నెవ్విధి నెట్టిచోట
నాచరించిన స్నానదానాద్యనూన
విధివిధానమ్ములకు నెట్టివిధిని నొందు
ఫలిత మది యెల్ల సల్లనఁ దెలుపుమయ్యా.

చ. అన విని రోమహర్షణి ప్రహర్ష మవేలమ యై యెడంద నె
క్కొన నని నిట్లు: సార్థకతఁ గూర్చి తలిర్చెను మీను
ప్రశ్న నాజనికి, సలభ్యమైన వ్రజసారసనేత్రలపెన్నిధాన
ముం బనిగొని సారెసారెకును వాకొనుభాగ్యము గల్గె
నిమ్మెయిన్.

తే. కృష్ణమృదుపదాసక్తభక్తిప్రపూర్ణ
మానసులు మానిసులెకద మహిని శ్రుతులు;
మీ రొనర్చిన భువనసంతారకమ్ము
ప్రశ్న మయ్యది సన్నుతిభాజనమ్ము.

తే. నందనందనుమహిమ మానందకంద
ళితము మనమున వినిపింతు : నతులితమయి
యతిశయిల్లుఁ దత్ప్రశస్త మాఖ్యాన మొకటి,
డాలకింపుఁ డెలర్ప ననన్యవృత్తి.

నారదు నంబరీషుఁడు వైష్ణవధర్మంబు లడుగుట

మ. తొలి పద్మోద్భవమానసప్రభవుఁ డస్తోకప్రభావాఢ్యుఁ డా శ్రీ
లలనాలోలగుణానుగానకలనోల్లాసుండు ప్రఖ్యాతస
త్కులపాథోధిసుధాకరుండు దివిషత్పూజ్యుండు శ్రీనారదుం
డలరన్ గ్రుమ్మరు చిన్మహాత్ములకు లోకానుగ్రహవ్యా
పృతిన్.

తే. పరమభాగవతాగ్రణి వంద్యచరణుఁ
డంబరీషుఁ డేల్గడ గా మహాప్రశస్తి
మెఱయు మధురాపురమ్మిచ్చ వఱలఁ జేరి
చనియె నమ్మహీజానిఁ గన్గొనెడుపనికి.

తే. అంత నారదుఁడు నతిభక్తి నమ్మునీంద్ర
చంద్రమసు విష్ణురశ్మిపుంజమున స

మంచితార్ఘ్యాదివిధులఁ బూజించి సుప్ర
సన్ను నొనరించి ప్రశ్నించెఁ గ్రన్న నిటులు.

సీ. సురమాని! యెద్దాని శ్రుత్యన్తవేత్తలు
పరము బ్రహ్మమ్మంచుఁ బలుకుచుందు ?
రెవఁడు వ్యక్తావ్యక్తుఁ డెవ్వానికిం జన్మ
మరణాదికమ్ములు వెరయ వెపుడు ;
నేదివ్యపూరుషునిచ్ఛ లోకమ్ము ల
ఖిలములు పుట్టుచు గిట్టుచుండు ;
నేసనాతనుఁడు నిర్మించి యజునకు నొ
సఁగెఁ దనలోని ప్రాఁజనువులెల్ల ;
నెవఁడు సర్వకారణుఁ డీశుఁ డీశశూన్యుఁ
డాదిపురుషుఁడు సర్వభూతాంతరస్థుఁ
డతనిఁ జిద్ఘను దివ్య నారాయణాఖ్యు
భక్తసఖు నెట్లు ధ్యానింపవలయుఁ జెపుము?

తే. వఱలి వాఙ్మనోఽగోచరత్వమున యోగి
వరులదృష్టిపథమున నేఁ బడఁగఁబోని
వాని నెవ్విధి ధ్యానించి పడయనేర్తు
రీప్సితమ్ములు ఘనులు శమింప భవము ?

గీ. ఉదితమవు దృష్ణ గోవిందమ్మదుపదార
విందనిష్యందమకరందబిందువులను

గ్రొత్తచవులూర నాల్కకుఁ గ్రోలలేని
యనద కాంచునె యజ్ఞదానాదిఫలము ?

గీ. కలుషముల పేరిఘోరాంధకారపటలిఁ
దృటిని మటుమాయ మొనరింప దినకరాభ
జలజలోచనుమృదుపదార్చనముకన్న
సున్న వేఱె నిష్కృతి పశుస్తోమమునకు.

గీ. ఏజగత్సర్జనక్రీడ నెసక మెసఁగు
దేవదేవుని భ్రుకుటి వర్తించు సిద్ధు
లెల్ల నాక్లేశనాశను నేవిధాన
మానవుం డుపాసింపఁగ నౌను జెపుము?

గీ. మౌని! భక్తిప్రియుఁడు భగవానుఁ డంబ
రాతఁ డెట్టిద భక్తి రయాంబ సుప్ర
సన్నుఁడై ప్రోల్చు; నయ్యుగుచరితమునఁగఁ
బొడము నెట్టులు తాదృశాపూర్వభక్తి?

క. అరయం బ్రహ్మవిదగ్రణి
వరిధరునకుఁ గూర్చునాఁడ వతిచతురుఁడవన్నన్
బరమార్థజ్ఞుఁడ వౌట న
మరముని! యడిగితిని నిన్ను మానుగ దీనిన్.

గీ. విష్ణులీలానువర్ణనవిషయకమ్ము
ప్రశ్న మవ్యానిపాదనీరంబుపగిది

నపుడే పావను నొసరించు నఘుగు వాని
నుమువువానిని నాలింపఁదొడరువాని.

చ. పెరయుట దుర్లభమ్ము పృథివీస్థలి మానుష దేహ; మెట్టులో
పొరసిన రూపఱుం దృఢిని బుద్బుదమట్లది; యంతలో
సుదుస్తరము రమాధవప్రియులదర్శనలబ్ధి; క్షణార్ధమైన ని
ర్జరముని! లబ్బె సాధుజనసంగముఁ కూరుచుఁ బూరుషా
ర్థముల్.

తే. వైష్ణవాగ్ర్య! పవిత్రము భవదమోఘ
యాత్ర వారక కూరుచు నఖిలభువన
ములకు సేమ మసీమము పుణ్యమూర్తి
నందనందనుగుణభాషణమ్ము విధము.

వ. కావున

క. ఏవాని నుడివినంతన
తావరమై శ్రుతిజఫలము తగ సేకూరుఁ
ఆవైష్ణవధర్మమ్ములు
దేవర్షివరా! రయమ్ము తెలియం జెపుమా.

నారదుఁ డంబరీషునకు వైష్ణవధర్మంబులు నుడువుట

క. అన నెనసినముదమున నను
మునివర్యుఁడు నారదుండు : పురుషోత్తమపా

దనవాంభోజద్వయచిం
తనరత! సలిపితి పుమర్థదము ప్రశ్నమ్మున్.

క. కమలామహిళాహృదయా
బ్జమిళిందము భక్తపక్షపాతి కృపాళుం
డు మురారిపదార్చన ము
త్తమధర్మము తథ్య మనుచుఁ దద్విదినవుడు!

సీ. ఎవ్వానిఁ గొలిచిన నివ్విశ్వవిశ్వ మా
రాధితకల్పమై ప్రథితిఁ గాంచు;
నెవ్వాఁడు సంతుష్టి నెనసిన నీచరా
చరజగ మెల్ల నెసంగుఁ దుష్టి;
నెవ్వానినామ మొక్కింత స్మరించిన
యంతమాత్ర శమించు నఘచయమ్ము;
లెవ్వానిపదరజ మ్మీశవాసవముఖ్య
దైవతవ్రాత మూఁదలస తాల్చు;
నవ్వనేరుహనేత్రు నవ్వహ ముపాస్యు
సకలభూతమహేశ్వరు సకరణుఁడయి
యెవ్వఁ డతిభక్తి మది నుపాసింపకుండు
నాతఁ డేరీతి నమృతత్వ మంద నేర్చు?

క. వినిచిన వినినం జదివిం
చినఁ జదివిన నాదరించి చింతించినఁ దా

ననుమోదించినఁ దత్త్వజ్ఞ
మనుపమభాగవతధర్మ మడఁచు నఘంబుల్.

సీ. కారణకార్యాదికారణకారణ
మ్మనన్యకారణశూన్యు సమరమాన్యు
వేద్యు నవేద్యుస్వవిభవు భవాప్యయా
పేతు వీతవికారు భూతభవ్య
భవదీశు యోగవిత్ప్రవరు జగన్మయు
నిర్గుణు గుణపూర్ణు నిరుపమానుఁ
బురురూపు నురుసత్త్వుఁ బరము నణీయాంసు
నజు నజజన్మము నజితు మహితు

నహితమర్దను జ్యాభరహరణనిరతు
స్వీయమాయాగృహీతసజ్జ్ఞేయరూపు
శతు శతాదిత్యసమతను సనకముఖ్య
వినుతు వినుతింపఁజను భక్తి మనుజుఁ డెపుడు.

క. అని వివరించియు యమునగం
బనిబూనితి మఱిల విశ్వభావనముల్ పా
వనములు వైష్ణవధర్మము
లనఘాత్మా! యాత్మ నిపుల నరునం బెనఁగెన్.

తే. శ్రుతిరసాయనములు మనస్సుఖకరమ్ము
లాత్మశాంతిదములు కృష్ణసమ్మృతచరిత

చరితములు ; దేవుఁ డవు భావసాధ్యుఁ; డిదియు
నీవ యెఱుఁగుదు స్వయముగ భూవరేంద్ర !

గీ. అయిన వివరింతు నాయోపినంతవట్టు
లిదె జగద్ధితమును గోరి యే నపార
గౌరవము పావకము మనసార గార
వించుచు నుదంచితయశ ! యాలింపు మిఁకఁ జలు.

గీ. పరమ మవికల్పము ప్రధానపురుషపరము
బ్రహ్మ మయ్యాదిపురుషుఁడు వాసుదేవ
మూర్తి యందురు బ్రహ్మవిష్ణ్వాఖ్యు; లలర
నవుఁ దదీయమాయామయమ్మయి యఖిలము.

చ. అకలుషభక్తియుక్తి నెవఁ డర్చనవందనకీర్తనేత్యుపా
దికములఁ బ్రీతుఁ జేయుఁ దను దివ్యుఁ డనంతుఁడు తా
నొసంగు వానికిఁ గృప మేర మీఱ నతి నిర్మల, నాయువు
భోగభాగ్యముల్, సకలము లీప్సితార్థములు, స్వర్గము నా
నపవర్గముం దుదిన్.

క. తలఁపన్ మనమునఁ జేఁతలఁ
బలుకుల ననయమ్ము భక్తపరతత్పరతా
కలనం బొలుచుమహాత్ముల
లలితములు వ్రతములు విను మిలాతలనాథా !

వ. అవియు మానసికకాయికవాచికమ్ములన ముత్తెఱంగులయి యెసంగు; సంపు—

ఆ. హింస తెరువుఁబోమి, ఋజుమార్గమున నాస,
స్తేయవృత్తిపరతఁ జెనయకునికి,
బ్రహ్మచర్యనిష్ఠ వ్రతములు మానసి
కము లనంతతుష్టికరము లధిప!

ఆ. భుక్తి యొక్కమాఱు, నక్తవ్రతాసక్తి,
భవ్యవృత్తిని నుపవాసదీక్ష,
యనువు ననిన నోరుల యాచించు టెఱుఁగమి,
కాయికములు వ్రతములై యెలర్చు.

ఆ. వేదమధ్యయనము, విష్ణుసంకీర్తన
పరత, నిత్యసత్యభాషణమ్ము,
పిశునభావ మాత్మఁ బెరయమి, వాచిక
వ్రతము లతులితములు ప్రథితతేజ!

గీ. అఖిలకల్యాణగుణధామునమలనామ
ములు నిరంతర మ్మెలైశఁ బొలుచుభక్తి
గాన మొనరింపనన్ను. నింత యేని జెనయఁ
జన దశౌచము యాపుణ్యానమయమందు.

గీ. తనరి వర్ణాశ్రమాచారతత్పరమతిఁ
బూరుషార్థము లర్థించు పుణ్యపురుషు

లెపు డుపాసింతు రచ్యుతు నిరతసన్న
గలదె నిశ్శ్రేయసకర మొకండు తెలుప.

క. రమణశ్రేయోర్థిను లా
త్మమనోవాక్కాయసంయమమ్ములు గలరన్
రమణీమణులు గొలుతు రు
త్తమములు వ్రతముల రథాంగధరుఁ గరుణాబ్ధిన్.

ఆ. ఆగమప్రసిద్ధ మైనమార్గమ్మున
నలరుబోంట్లు నాల్వకొలమువారు
నాచరింపనొప్పు నతిభక్తి ద్విజవర
రూపుఁ జాపరాత్పరునిసమర్చ.

తే. వేదవిహితమార్గమ్మున ద్విజుల పేరఁ
బరఁగు మైమూఁడుకొలములవారు; నామ
సంస్మృతిన స్త్రీలు, శూద్రులు జలుపనౌ ని
రతము భువనాధినాథునారాధనమ్ము.

తే. యజనయాజనపూజనాద్యముల, వ్రతము
లం గనం డింత ముదము నచంగుతండ్రి,
భక్తిగమ్యుఁ డగమ్యుఁడు భక్తవత్స
లుండు భక్తిప్రియుం డచ్యుతుం డనంగ.

క. పరమపతివ్రతలవు నుదు
చరితలు గరితలకుఁ గూర్చుసామిదు దైవ ;
మ్మరుదారఁగఁ బూజ్యం డను
నిరత మవారలకు హరిమనీష నతండే.

క. అలరుగ నామస్మృతిఁ బ
న్యలకుగ ; దేవార్చనమ్ము లొనరింతురు స
ద్వ్రాలు శ్రుత్యనువాదమ్మయి
యలరెడు నాగమముమార్గ మాచారముగాగ.

క. పతిహితచింతాసంతత
లతివలకుం గలదు నిక్క మధికృతి కమలా
పతిపూజాదికముల నని
శ్రుతి యంచితగతి వచించు క్షోణీనాథా !

తే. తమకులమ్మున కనువను ధర్మవర్త్మ
మున స్వవిహితముల్ వ్రతములఁ బూర్ణభక్తి
నాచరింపఁగ నొప్పుఁ; దా నరుస మొలయు
దాన నెమ్మది నమ్మధుదానవారి.

తే. జ్వలన, జల, హృదయార్క-మండలములగాఁ
గొని హవిస్సును, నమ్లానకుసుమకోటు
లొసఁగి, ధ్యానించి, జపియించి, యొగి యజింతు
రారమానాథు నుదుగక సూరివరులు.

గీ. హరి నహింసా, వశమ్ములు, భూతదయయు,
క్షాంతి, శాంతి, దాంతులు, ధ్యాన, సత్యము, లన
నలరు నలరు లెన్మిది గొని సలుపుపూజ
కాజగన్నాథుఁ డప్పుడ హర్షమొందు.

వ. అవి యివి యననేల, భక్తిసమర్పితమ్మగు సుమ మ్మొకటియైన
యగుంగాక యయ్యది భక్తిప్రియుండగు భగవానునకుఁ
బ్రమోదకారణంబ యగు నంతియగాక—

సీ. జలజాతముల్ జలజాతముఖ్యమ్ములు
వారుణసుమము లై వాసిఁ గాంచు;
సౌమ్యముల్ సుమములు సర్పిఃపయోదధు;
లెసఁగుఁ బ్రాజాపత్యకుసుమములయి
యన్నాదు; లాగ్నేయ మా ధూపదీపాది
కము; ఫలపుష్పముఖ్యమ్ము విటపి
మయము; పార్థివకుసుమము కుశమూలాద్య
మౌ; గంధముఖము వాయవ్యసుమము;

వైష్ణవము శ్రద్ధ; వాద్యమ్ము విష్ణుపదము;
నలరులకా వీనిఁ గొని యర్చ యాచరించు
నంతమాత్ర ననంతము సంతసమ్మ
నంతుఁ డెనసి యొసంగు స్వీయమ్ము పదము.

తే. అరుణుఁ, డింగలమ్ముం, బొఱుఁ, డొలు, వైష్ణ
వోత్తముఁడు, మిన్ను, కరువలి, యుదకములును,
బుడమి, యాత్మ, భూతవ్రాతములు, మురారి
యర్చనంబు గూర్చు నెలవు లభ్యర్చితేశ!

సీ. సవితృనం దినమంత్రజాప్యమ్మునన్, జాత
వేదస్సునందు హవిస్సుచేత,
నొసఁగి యాతిథ్యమ్ము నుర్వీసురునియందు,
నావుల గ్రాసరసాదికముల,
వైష్ణవోత్తమునందు బంధుసత్కృతి, హృద
యాంతరమ్మున ఘనధ్యాననిష్ఠ,
గాలి సుఖ్యమనీషఁ, గీలాలమున నప్పు
రస్కృత మ్ముత్తమద్రవ్యసమితి,

స్థండిలమ్మున మంత్రహృత్ప్రఖ్యభోగ
జాలమ్మున, నాత్మ నాత్మను, సకలభూత
ములలో క్షేత్రజ్ఞుని సమత్వబుద్ధి మెఱయఁ
జిద్ధునన్ సర్వమయు సమర్చింపవలయు.

గీ. శంఖచక్రగదాజలజాతరుచిర
కరచతుష్టయు వనమాలిఁ గనకవసనుఁ
గౌస్తుభాంచితు భావించి గాఢభక్తిఁ
గొలువనొ జలజాక్షు నీనెలవులందు.

గీ. పూజితుం డవునెడ లెస్స భూమిసురుఁడు
పూజితుఁడ కాఁగలాఁడు విభుం డతండు,
భర్త్సితుం డవునెడ నవు భర్త్సితుండ
తాను; నాలకించితే యిటు మానవేశ !

గీ. సొరు మీఱు నెంతయు యదాధారములయి
నిగమధర్మశాస్త్రమ్ము లా నిర్వికల్పు
లవని నిర్జరులన్న సత్యాంతపూత
మైన వైష్ణవీమూర్తి యటంద్రు బుధులు.

చ. ధర శుభముల్ సమస్తములు తథ్యము ధర్మప్రతిష్ఠ నలభ్యముల్
పరమము ధర్మమయ్యదియు వర్తిలెడున్ నిగమమ్ము దిప్పఁగా,
శరణము తద్ద్వయమ్మునకు బ్రహ్మసురుఁ డొక్కఁడ కాన
వానికిం జరిపిన నర్చ శాస్త్రవిధి సర్వమయుండును నర్చి
తుండ సూ.

తే. యజ్ఞదానతపోవ్రతధ్యానయోగ
సేవనాదుల మోదము దేవదేవుఁ
డెనయఁజనఁ డెనాఁడేని మహీసురేశ
తోషణమ్మున నెట్లు పోషితజ్య !

క. బ్రహ్మిష్ఠుఁడు బ్రహ్మజ్ఞుఁడు
బ్రహ్మణ్యుఁడు బ్రహ్మసంప్రవర్తకుఁడు పర

బ్రహ్మము సంతుష్టిం గను
బ్రాహ్మణసంతోషణమున వసుధాధీశా!

తే. కడుపునం గన్న కొడుకు నిష్కలుషభక్తి
నాచరించెను నెడ నచ్యుతార్చనమ్ము
నరకమున మున్గిన పితరు లిరుతెఱఁగుల
వార లపవర్గముం గాంచువార లపుడ.

గీ. అఖిలభూతమయమ్ము దయాపరమ్ము
వాసుదేవాహ్వయము పరబ్రహ్మమందుఁ
బ్రవణచిత్తత నలరని పశుసమాన
మానవులు ధరాభారాయమాణు లనఘ!

క. ఎన్నఁడు నెవ్వా రెఱుఁగని
పన్నగవరతల్పుధ్యానపథము వచింతుఁ
విన్నంతన దీనఁ బుధ
సన్నుత! కైవల్య మెనయు జనుఁ డభవుండై.

వ. మఱియు

చ. పడక మరుద్గతిఁ జలనవర్జితమై బహుదీప్తిమంతమై
యడరెడు దీప మేసగిది నారని ఘోరపుచిమ్మచీకటిం
బోడమడఁగించు నాకరణి భూపకులాగ్రణి! ధ్యాననిష్ఠ రూ
పడఁచ పయుంబ దోషనివహంబు నిరామయుఁడౌ నరుం
డౌగఁ.

ఉ. ఆస లడంగు, నిశ్చలత యబ్బుఁ, దలిర్చుఁగు మిత్రశత్రుతల్, లే
దోసము లంటఁబోవుఁ, బరితోషవిషాదభయభ్రమాదులన్
బాసి చనున్, హృషీకములవ్యాపృతి రూపఱు, ధ్యాన
రూఢిఁ బెన్యాసిని గాంచుజ్ఞానికి; నవాఁ డెప్పు డొప్పును
బ్రహ్మభూతుఁడై.

తే. శ్వసనహతి లేని దీప మచలత గదుర
జ్వలనకర్మగతారూఢి వర్తికాస
హాయమునఁ దైల మింకించి యవల విడచుఁ
దైలకలుషంబు కొడిపేరు తనర సధిప!

తే. తాఁ గొని క్రమక్రమమ్మునఁ దైలమెల్లఁ
దిర్వలిక నిర్మల మ్మగుదీప్తి మెఱయు;
నటులె, కర్మస్థితుఁడయి కర్మాఖ్యమైన
నూనె నింకించుఁ గొంకక జ్ఞానధనుఁడు.

తే. క్రోధలోభాదికాఖ్యమరుత్తు లేక
యచలత స్మృతి నిర్మలుం డన్నుచు జ్వాల
చాయ వెలుఁగుచు విషయకజ్జలము విడిచి
యుజ్జ్వలుఁడు నిస్పృహుండయి యొప్పు నతఁడు.

వ. ఇదియెల్లఁ గేవలజ్ఞానస్వరూపోద్దిష్టమ్ము. ఇఁక ధ్యానవిధానమ్ము మూలాగ్రమ్ము వివరింతు నయ్యదియు సగుణ నిర్గుణభేదంబుల నిరుతెఱంగుల నెసంగు; సంహు—

గీ. "సర్వకర్త సర్వజ్ఞుఁడు సర్వసాక్షి
సర్వకారణభూతుఁడు సర్వమయుఁడు
పూరుషోత్తము నెఱుఁగ విముక్తతం బ
రార్థపరులైన యోగులు నందుచుండ్రు.

తే. కాలుసేతులు లేకయు కడు రయమ్ము
గదురఁ జను నెల్లెడలను; జంగమ మజంగ
మము గ్రహించుఁ ద్రైలోక్య; మాస్యము హుళక్కి-
తినును; లేదు నాసమ్ము వాసన లెఱుంగు;

గీ. లేవు జానుగు లన్ని యాలించుఁ; గాన
రాదు నాల్క పల్కును సుధాస్వాదితమును
గాంగ; లేక త్వచమ్ము వీఁకం గ్రహించు
స్పర్శ మన్నిటియదియు నా సర్వమయుఁడు.

ఆ. రూపు లేదు, వఱలు రూపసంబద్ధుఁడై
పంచవర్గవశము గాంచి మించుఁ;
ఘ్రాణ మఖిలమునకు; జ్ఞానబలక్రియ
తత్స్వభావసిద్ధ; ఘ్రాత యతఁడు.

గీ. అమలుఁ డానందమయుఁ డాద్యుఁ డగుణుఁ డజుఁ డ
నాశ్రయుం డఖిలాశ్రయుఁ డద్వయుం డ
ఖండుఁ డఖిలాంతరస్థుఁ డా ఘనున కెందు
లేరు పితృపుత్త్రమిత్రాప్తవైరిజనులు."

తే. అని నిరామయు నిర్గుణు వ్యాపిగాఁ ద
లంచి యప్పరాత్పరుని ధ్యానించి మిందు
టలరు నూ నిర్గుణధ్యాన మనఁగ, నదియె
శ్రీప్ర కైవల్యపదలబ్ధికిం బథంబు.

క. "హరి ధర్మక్షతి ధర్మే
తరపథమభివృద్ధి పొసఁగు తఱి నిజమాయా
పరిధృతనానాతనుఁ డయి
ధరఁ బ్రోఁచును దానవారి దయ దయవారల్.

తే. వాసిత మ్మయి బ్రహ్మాండభాండ మఖిల
ముం దదావాసవశమునఁ బొలుపుఁ గాంచు;
నట్లుగావున, వాసుదేవాఖ్య వఱలు
దేవదేవుఁ; డాతఁడు భూతభావనుండు.

గీ. కలుగు వెలుఁగును జలదానకలన వర్ష
మాణమేఘమునకు యదనూనభాస
జలజమిత్రాదులకుఁ బ్రకాశమ్ము నొసఁగు
స్వప్రకాశుఁడు హరి చతుర్బాహుయుతుఁడు.

సీ. దనుజభీదమ్ము సుదర్శనాఖ్యానమ్ము
చక్రమ్ము సవ్యహస్తద్వయమ్ము
నందు నొకంట, రెండవుకయిఁ గౌమోద
కీనామకము గద మా నెసంగు;

ఆ. ఎవఁ డనన్యచింత నీరీతి ధ్యానించి
మించు నాఘనుఁడు భుజించి యీడు
గననిసుఖము తుదిని గాంచు ననంతమ్ము
పరమపదము వీతభవుఁడ యగుచు.

వ. అంబరీషా! నీయడిగిననరణి హరిధ్యానవిధానంబును వేద్భే
దంబులను వివరించితి నింక నెయ్యది వినవలతు వెల్లింగింపు
మన నారదున కా ధరారమణుం డిట్లనియె.—

తే. వేదవిద్వర, నారద! వింటి నీయ
నూన మనుకంప శ్రీహరిధ్యానమార్గ
మే నఘమ్ము శమించెఁ దరించి తీ భ
వమ్ము వేరిటివిషరాశి నాగునట్లు.

వ. అయిన నింకొక్కఁడు వివరింపం బ్రార్థింతు.

ఆ. భక్తి యనఁగ నెద్ది, పరఁగు నే తెరువున,
నెవ్వఁ డెట్టు లెచట నెప్పు డాచ
రించి కాంచు ఫలము నేచందమునఁ దెల్పు
మనిన ధాతృసూతి యనియె నిటులు.

భక్తిస్వరూప వివరణము

ఉ. మానవనాథచంద్రమ ! రమాధవమిత్రుఁడ వీవు కాన లో
కానుజిఘృక్షఁ బూని తిటు లాఘనులీలలె పృచ్ఛ సేయు నిం

తే నిజ; మాలకింపుము వచింతు ననంతము భక్తివైభవం
బే; నఘనాశనమ్మయి యనేకవిధమ్ముల నొప్పు భక్తియుఙ్.

వ. మఱియు నది మనోవాక్కాయసంభవతఁ ద్రివిధయయి మఱల లౌకిక వైదిక ఆధ్యాత్మికభేదమ్ములఁ ద్రైవిధ్యమ్మొందు.

గీ. ధ్యానధారణారూఢమ యైన బుద్ధి
సంస్మరించుచు వేదవచనములం బ
రాత్పరునియంద మనసుంచి తత్పరమతి
నలరుటే మానసికభక్తి యన నెసంగు.

తే. సంతతమ్మవిశ్రాంతసంచింతనముల
నుచ్చరించుచు మంత్రవేదోక్తు లతుల
జపములారణ్యకమ్ముల శౌరిఁ బ్రీతు
సేఁత వాచికభక్తియై చెలఁగు నధిప !

తే. వశము నొసరిచికొని యక్షపంచకమ్మ
స్వవిహితవ్రతాదృతి యుపవాసదీక్ష
లుం గదుర నిందిరాలింగితాంగుఁ గొలుచు
టలరుఁ గాయికభక్తియై యవనినాథ !

గీ. లలిఁ బదాఱుపచారమ్ము లలర నిర్జ
రార్చ్యు నచ్యుతుఁ నర్చితు నాచరించి

నృత్యవాదిత్రగీతాదినిరతి స్తుతులఁ
బ్రముదితుం జేత లౌకికభక్తి సుమ్ము.

గీ. ఋగ్యజుస్సామజాప్యాది కేచ్ఛ, సంహి
తాధ్యయనము వైదికభక్తి యనఁగ నెసఁగు
వేదమంత్రహవిర్యజనాదిరూప
మైన క్రియయు వైదికభక్తి యవు నరేంద్ర !

తే. అరయ దర్శము, పౌర్ణమాస్యమ్ము, ప్రేష్ఠి
ప్రాశనము, దక్షిణాపురోడాశచరువు,
లిష్టి, ధృతి, సోమపానము లివ్వి సాధ
నములు వైదికభక్తికి నమలచరిత !

ఆ. పంచభూతములను భాస్కరశంకరా
దులను నిలిపి మదిని సలుపుకర్మ
మఖిల మలరు భక్తి యాధ్యాత్మిక మ్మయి
సుమ్ము విష్ణుదైవతమ్ము సదియ.

వ. మఱియు సాంఖ్యయోగాదిక భక్తిస్వరూపమ్ము లెఱిఁగింతు నాకర్ణింపుము.

క. లలిని బ్రధానప్రముఖ
మ్ములు సాంఖ్యప్రోక్తతత్త్వములు పరిభోగ్య
మ్ములు చేతనేతరము లయి
యలరారు నిరువదినాలు గవనీపాలా!

ఆ. భోక్త, చేతనుండు, పూరుషుఁ డిర్వదే
నప్రుసతం; డతండె యాదికార
ణము, మహేశ్వరుం, డనామయుఁ, డవ్యక్తుఁ,
డాత్మ, యఖిలకర్త యనఁగ నెసఁగు.

ఆ. పొసఁగు వానిమూలమునను ముత్తెఱఁగుల
నెసఁగుసర్గకార్యమెల్ల; నఖిల
మాశ్రయించియుండు నప్రమేయము పంచ
వింశతత్త్వమును నవేళ నిజము.

క. అని తుది మొదలుం గాన్పిం
పని నిత్యము శాశ్వతమ్ము పావనము ఘన
మ్మను తుది తత్త్వము బ్రహ్మ
మ్మను మననమున భక్తిభావపూర్ణులు సాంఖ్యుల్

వ. సేవింతువా రయ్యాదియు సాంఖ్యకృత భక్తివిశేషంబు. ప్రాణాయామపరాయణులై బహిరంతరింద్రియవ్యాపారంబులు దూరంబులు సేసి ధారణారూఢి హృత్పద్మకర్ణికాసమాసీనుండును, పీతవసనుండును, వ్యాకోచాంబుజదళలోచనుండును, బ్రహ్మసూత్రకటీతటుండును, గౌరవర్ణుండును, చతుర్బాహుండును. శంఖచక్రగదాధరుండును, కృపాకరుండును, వనమాలానివీతాంగుండును, రూపవైభవవిజితానంగుండును, రమాలింగితవక్షుండును, భక్తపక్షుం

డును, శిక్షితాశేషరక్షోవ్రాతుండును, భువసరత్నాదిక్షితుండును, నవ నవపుండరీకాక్షు పీతవిషయోపభోగులు నరాగులు నగు యోగులు ధ్యానించి యంచితము పరమ పదముం జూరగొందు రియ్యది యోగసిద్ధయును మానస సిద్ధి యనంబడుచు మహోత్కృష్టంబు భక్తివిధానంబయి యలరుఁ బూర్వోదిష్టంబులు భక్తివిశేషంబుల నెవ్వఁడనన్య చింత నయ్యనంతు నారాధించు నతండు పరమభక్తాగ్రణి నాఁ బరంగు.

తే. మఱియు నానాప్రకారమై వఱలు భక్తి
తవిలి సాత్త్వికరాజసతామసాది
భేదములఁ; గట్టెలంబోలెఁ బేర్చు చిచ్చు
కాల్చివైచుఁ దక్షణమ యఘంబు లిద్ధి.

ఉ. భూరిభవజ్వరాపహ మపూర్వము శ్రీహరిభక్తినామ నిష
త్సారము దుఃఖతారము సుధారససారముఁ గ్రోలఁ వీనులం
గోరకయుండుదాఁక నతిఘోరము జన్మజరాంతరూపదు
ర్వార మనేకదేహజ మవాచ్యము దుఃఖము మర్త్యుఁ
డొందెడున్.

ఉ. చింతితుఁడై సుగీతుఁడయి సేవితుఁడై నతుఁడై నుతుండునై
యంతరనుగ్రహాత్మమహిమాన్వితుఁడై కుసుమార్చితాం
ఘ్రియై సంతతసిద్ధసాధ్యసురసంస్తవనీయచరిత్రుఁ డిందిరా

కాంతుఁడు పాఱద్రోలును నఘంబుల గాలి మొయిళ్ళఁ
జాడ్పునట్.

గీ. స్నానదానదేవార్చనజ్వలనతీర్థ
సేవనశ్రుతాచారతపోవిధాన
యాగముల శుద్ధిఁ గనఁజన దంతరాత్మ
హరి హృదంతరగతుఁ డైనయపుడుపోలె.

క. వినఁబడు నెచ్చో నచ్చపు
వనజాయతనేత్రుకీర్తివైభవ, మతిపా
వనము లసంస్కృతిసంభా
వనములు ధన్యములు కథలు పరమార్థదముల్.

వ. ఆయానెలవులు సాక్షాన్మోక్షేందిర కిరవులై యతిశయిల్లు.

మ. ధరణీనాథకులావతంస, యదునాథశ్రావ్యభవ్యశ్రవో
వరపీయూషరసానుపాననిరతవ్యాపారపారీణ, వే
ణురవోల్లాసితగోపగోనికరునన్యూనమ్ము మాహాత్మ్య మొం
ది రతిన్ గంటి కుతూహలమ్ము వినఁగా నీ వెంత ధన్యుం
డవో!

క. శ్రితమందారు నుదారుఁ బ
తితజనతోద్ధారుఁ దలఁచు తిన్నన లే కా
తతదర్పాహంకారా
వృతజడునకు శ్రేయ మెట్లు పెరయు నరేంద్రా!

క. మాయాజని నిర్మాయుఁడ
మేయుఁడు నారాయణుఁడు మీఱినభక్తిం
బో యతిసుఖసాధ్యుం డవు
మాయువులకు దొఱకునాఁటె మనుజాధీశా!

చ. మురరిపుపుణ్యపాదనవఫుల్లపయోరుహచంచరీక, భూ
వరవర, ధర్మధుర్య, హరిభక్తజనాగ్రణి, వేదసారవి
ద్వర! యెట నీ యెఱుంగని శుభంకరతత్త్వ మొకండును గాన
మూర్వర; నను బృచ్ఛ సేసి తిఱు వైష్ణవగౌరవహాస్యబుద్ధి నే.

ఆ. పుడమిఁ గానరాదు పుణ్యమ శేషసం
తోషపోషకమ్ము భూషణమ్ము
శ్రోత్రములకు జలజపత్రనేత్రు చరిత్ర
కన్న వేఱొకండు గాథ యధిప!

గీ. అయ్యనంతుననంతకళ్యాణగుణవి
శేషభాషణమన్న పీయూషసార
మూర నిచ్చక్రొత్తలు చవు లుడుఁగ కెపుడుఁ
గ్రోలుచుందురు సాధుచంద్రులు నరేంద్ర!

గీ. పుడమి వేల్పులు, వేల్పుల మొదవు, నిజము,
శ్రద్ధ, యాగమ్ము, తపము, ప్రాఁజదువుగములు,
స్మృతివచస్సులు, దీక్ష, కూర్మియు, శమమ్ము,
మాఱురూపమ్ములై యొప్పు మాధవునకు.

క. ఇనుఁడు సుధాంశుఁడు ధారుణి
యనల మ్మనిలమ్ము నుదక మంబరము దిశల్
వనజభవుం డభవుఁడు నా
సనకాదిస్తుతుఁడ; వాఁడు సర్వమయుండౌ.

గీ. విశ్వరూపుఁడు విష్ణుఁడు స్వీయమాయ
చేఁ జరాచరరూపమ్ము లీజగమ్ము
లెల్ల నిర్మించి మించె; భుజించుఁ జుమ్ము
బ్రాహ్మణాకృతి నన్న మవాఁడ తేఁడ!

తే. సకలతీర్థసారమ్ములు క్ష్మాసురమ్ము(?)ను
పదపరాగముల్ త్రిభువనభవికకార
ణమ్ము, లవ్వారి సర్వభూతమ్ముల నతి
భక్తిఁ గొలువుమా హరిబుద్ధి వలల నీవు.

ఆ. పరఁగు వాఁడు విష్ణుభక్తముఖ్యుం డయి
స్వస్వవిహితకర్మపరుఁడ యవుచు
బ్రహ్మవిద్వరేణ్య బ్రాహ్మణు నెవ్వాఁడు
కొలుచు విష్ణుబుద్ధి కడలుకొనఁగ.

వ. అది యట్టులుండె మహోత్కృష్టఫలప్రదమ్మును రహస్య
మ్మొకఁ డొప్పు నయ్యది యెఱింగింతు వినుము.

మాధవ మాసాధిక్య వర్ణనము

తే. ప్రాప్త మీయది మాధవవల్లభమ్ము
మాధవము మాస మత్త్యుత్తమమ్ము, దీని
తొలిసగమ్ము నేఁడవునాఁడు దుర్లభమ్ము
నన్యసామాన్యఫలదానగణ్య మనఘ!

గీ. మున్ను జహ్నుమహర్షి తాఁ బాఁడమ మనము
నం గనలు ద్రావి నవ్యకర్ణమ్ము మార్గ
మునఁ ద్యజించెఁ గ్రమ్మఱ నాఁడ ఘనతరంగ
భంగమంగళ గంగ నుప్పొంగఁ గరుణ.

క. ఆనాఁ డెవ్వాఁడు మానస
మానందమునం దలిర్ప నాజహ్నవి సు
స్నాన మ్మొనరిచి యుచితవి
ధానమునం గొలుచు నతఁడు ధన్యతఁ గాంచున్.

క. ఆవాఁకనీట నాఁటం
గావించిననిర్జరపితృగణతర్పణముల్
పావనము లతులఫలసం
భావితములయి యలరారు; వాఁ డమృతుండౌ.

క. కన మాధవమాసమ్మున
కెన యవ్వ నెల విష్ణుపదజ కీర్తి చను పా

వసుధుని లే దేయెడఁ బ్రా
ప్తసుకృతముకతన నవ్వి తగ లభ్యములౌ.

తే. శ్రీమనోహరుమృదుపదతామరసము
రసమునం బుట్టి తనుపుచు బ్రహ్మపదము
పుడమి డిగి ముత్తెఱంగుల నడుచు దివ్య
గంగ పూత మొనర్చు జగత్త్రియమ్ము.

క. ఘోరతరకలుషకర్దమ
హారిణి సుఖకారిణి భయదాఖిలదుర్గో
త్తారిణి త్రిమార్గచారిణి
కూరుచుఁ గూరిచినవారికోరుకు లెపుడున్.

గీ. కడఁగి సంజలు మూఁడిట గంగ గంగ
గంగ యని స్మరించెడువానికల్మషమ్ము
లెల్ల లాగివేయును గాంత మినుమునట్లు
కలిజనమలప్రశమని గంగాభవాని.

క. మనమునఁ దలఁచిన శతయో
జనదూరగుఁడేని నరుఁడు జహ్నుసుతం ద
త్క్షణమున బహుజన్మార్జిత
ఘనదురితము లడఁగఁ గాంచుఁ గైవల్యంబున్.

వ. అమ్మహాధునియు వైశాఖశుక్లసప్తమీదివసమ్మునఁ గోటి
గుణితఫలప్రదానంబునం దనరు. నట్లపుటం జేసియ

క. దురితాంభోనిధి మునిఁగిన
నరులకుఁ దారకములై తనరు మాధైవాం
తరములు మాధవమాధవ
వరయుగలముకన్న సున్న వసుధాధీశా!

సీ. దైవతమ్ముల దేవదేవుఁడు హరియట్లు,
జపముల గాయత్రిచందమున, స్ర
వంతులం ద్రిపథగపగిఁది, లతాంగుల
నుమవోలె, వెలుఁగులఁ గమలమిత్రుఁ
డటులు, లాభమ్ముల నారోగ్యలాభమ్ము
విధము, ద్విపాత్తుల విప్రుసరణి,
సుకృతమ్ములం బరోపకృతిరకమ్మున,
విద్దెలనన్నిట వేదమట్లు,

మంత్రములఁ బ్రణవము, ధ్యానమార్గసమితి
నాత్మచింత, శౌచమ్ముల నర్థశౌచ,
మభయ మీవుల, గుణముల లోభశాంతి
మాద్రి, మాసాలఁ దలకట్టు మాధవమ్ము.

క. ఇమ్మహితము మాసమ్మున
సమ్మద మొదవం బొనర్చుస్నానానుష్ఠా
నమ్ములు హోమవ్రతదా
నమ్ము లనంతఫలములయి నలువారు నృపా !

క. లలి వైశాఖాంతమ్ములు
కలుషము, లరుణాంత మంధకారము, ప్రాంత
మ్ములు నుపకారపిశునతా
కలనఁ సుకృతమ్ము లవనికాంతాగ్రణ్యా!

వ. మఱియు మిహిరుండు తులాస్థితుం డవుతఱిఁ గార్తికంబున నొనరుచున్న నదానాదివిధానంబు లనంతఫలవంతంబు లంత కంటెఁ గోటిగుణితంబులై యవి రవి మకరాయనగతుం డవునవసరంబున మాఘంబునఁ దనరు; నరుణుండు మేషప్రవిష్టుం డయియున్న దినంబుల వైశాఖంబున నపారమ్ము లర్థమ్ములు చేకూరుచు నని వినిచిన విని నను చు నాదృతి నాక్షితిపతి త్రిదశమునిపతి కిట్లనియె.

గీ. మాధవప్రీతికరములు మార్గశీర్ష
ముఖ్యమాసమ్ము లితరముల్ పొలుచుచుండ
నేల మాధవమాస మాలీల నుత్త
మోత్తమమ్ముగఁ గథితమై యొప్పనయ్యె.

గీ. ఎది తదాచరణీయత నెసకమెసఁగు,
నీయనౌ నీవి యేవిధి నేర్పరింపఁ
బడియెఁ, దప మేదొ, కొలువఁగా వలయు దైవ
మేదొ వివరింపుమయ్య నా కీడ్యపాద!

గీ. త్వత్పదాంబుజయుగరజఃపావితాత్ము
నను సదుపదేశముప్రసాదమున ననుగ్ర
హింపుమా, ధర్మరూపుఁడ వీవె తత్త్వ
వేత్తవును హరిప్రియుఁడవు విధితనూజ !

గీ. మాని ! నిర్మాత, యుపదేష్ట, మంత, తదను
మంతయుం, బ్రయోజకుఁడు సమానభాగు
లని వచింతురు శాస్త్రజ్ఞు; లఖిలకర్మ
ఫలము ధర్మోపదేశ సంప్రాప్యము కద !

గీ. పుణ్యతీర్థావగాహనములు, తపోవ్ర
తాదికర్మములు, యాగమ్ము లాచరించు
వాని కొదవుఫలమున సాబాలు తత్ప్ర
వర్తయితకుఁ జెందు నటంద్రు భావవిదులు.

చ. పొనరుచు నెట్లు శ్రేష్ఠుఁడవు పూరుషుఁ డెయ్యది, నిచ్చ
లద్దియే జనులు తదన్యు లెల్ల అటు నల్పుఁగఁ బాల్పడు
చుందు, రెద్ది గైకొను నతఁడు ప్రమాణముగఁ గొందు
రవారును దాని నట్లు కావునఁ గలధర్మమర్మములు
పొల్పుగఁ దెల్పు మనల్పధీనిధీ!

క. అన నొలయఁగఁ జిఱునగ వా
ననమున నలినప్రసూతినందనుఁ డను న

వ్మ్మను జేశకులాభరణ
మ్ముమన కిట్టులు గట్టు దాఁటి పొంగుముదమునన్.

గీ. వినుము, నీయడిగినమహద్వృత్తమెల్లఁ
దెల్లముగ వినుపింతు; నే నుల్ల మలరఁ
దొల్లి యడుగు డిదియ యుల్లసిల్లుకరుణఁ
గమలభవుఁడు నుడివినవిధము నృపాగ్ర్య!

చ. పరఁగు నలభ్యవృత్తి జని భారతవర్షమునందు, నందునన్
నరతనులబ్ధి, పూరుషత, నందితరీతి స్వధర్మవర్తనా
భిరతి, రమేశభక్తిపదవీపరిరూఢమనఃప్రవృత్తి, యా
స్మరపితృహర్షకారణముమాధవమాసముసేవ భూవరా!

గీ. అట్టిమాధవమాసమ్మునం దమంద
మా నియతి స్నానదానజపాదు లాచ
రించునంచితధిషణులు కాంచఁబోరు
శమనభటతర్జనోద్భర్త్సనముల యెపుడు.

ఆ. అవని లేదు మఱొకఁ డైహికాముష్మిక
ఫలదమైన మాధవమ్ముకన్నఁ
బుణ్యమాస మున్నె పుష్కరరాశికి
సాటివచ్చు మేటినీటిపట్టు?

క. కలిమలధ్వంసి మాధవాఖ్యానమాన
తాహ్ల్యపతూరవమ్ము శ్రోత్రములఁ బడక

పాసి చనవు పాపములన్న పాఁపదొరలు
నరకలేవరమ్ముల వేఁరినాకువులను.

గీ. అసమమాహాత్మ్యకలితముల్ హరికి నిష్ప్రల
హర్ష కరము లిమ్మధుమాసమంత్యదినము
లయిన; నేకాదశీతిథి యాదిగఁ గల
యవ్వి శుక్లసప్తమి కెనయయిన వనఘ !

గీ. ఒదవ నకలుషభక్తి నెమ్మదిని నెవ్వఁ
డీదినమ్ములైదిట నాచరించు నుక్త
విధి యథావిధి నాతఁడు పెరయు సర్వ
మాసదీక్షౌఘఫల మ్మసమానవృత్తి.

గీ. బహుళఫలదమ్ము మాధవవల్లభమ్ము
మాధవమ్ము మాసమ్మున మాధవుం డె
వానిచే నర్చితుండవు భక్తితత్ప
రత్వమున, వాని కున్నె దుర్లభ మొకండు ?

గీ. స్నానదానవిహీనులు మానదంభ
పాశవేష్టితు లెల్లఱు పంచవాస
రాత్మకమ్మ యయిన మాధవావగాహ
నమున మాధవులే యయి యమరువారు.

తే. కమలబాంధవుఁ డుదితుఁడు కాకమున్న
నలిపి జాహ్నవీ రేవాంబువులల్లొ స్నాన

మెవ్వఁ డర్చించు నచ్యుతు నీనెల నతఁ
డనఘ! సర్వసుపర్వగణార్చ్యపదుఁడ.

వ. అని వెండియు, నంబరీషా! ఇట్లను దినమ్ములను స్నానదాన జపాదులం దేమఱక వ్రతిస్థైయై యమనియమము లమర హవిష్యాన్నముం గుడుచుచు నిలఁ బండుచు బ్రహ్మచర్య వ్రతనిరతుండయి మధుమాసనిషేవణ మొనర్చుచు మాస వృందు తత్పౌర్ణమాస్యాదివసమ్మున మధువ్రత మ్మాచరింప వలయు; నానాఁటిపవలిట మధుతిలాదులు దాన మ్మొనరించి వేదవేత్తలవు బ్రాహ్మణోత్తములను సువర్ణశృంగలు రౌప్యఖురలు సుధాసహాలు సవత్సలు నవు నావులఁ నీవలయుఁ బదంపడి రోపినకొలంది సన్మానల విష్ణుభావంబున భూతతృప్తిం గావింపంజను; నిట్టు లవిఘ్నంబుగఁ బంద్రెండేడులు విధి దృష్టవిధానంబున నాచరించి యుద్యాపన సేయనవు; నీవిధి నొనరించువాఁ డొందుకళ్యాణంబు లవర్ణ్యంబుల యనిన విని యబ్బురంపడుచు నంబరీషుం డిట్లనియె.

తే. అనఘచరిత! యత్యల్పమాయాసమునస
కేవలైతదుపస్నమయావగాహ
నమ్మునకతమున నతిదుర్లభమ్ము ఫలము
కరగత మ్మగునన్న నబ్బురము వొడము.

వ. అంత నయ్యరవిందభవనందనుం డి ట్లనియె.

ధర్మసూక్ష్మవివరణము

మ. నరనాథాగ్రణి ! ధర్మసూక్ష్మము లవర్ణ్యప్రాభవాఢ్యమ్ము
లెవ్వరు నవ్వాని నెఱుంగనేఱరన నబ్రంబే, మహాయోగి
శేఖరులుం జెందుదు రిందు మౌగ్ధ్యము గదుర్ గాంగేయ
ముఖ్యుల్ జనిర్ ధరణీపాలురె ధర్మసూక్ష్మగతి నొందం
బోరె బ్రాహ్మణ్యముర్.

చ. కులజ, సుశీలశాలిని, యకుంఠగుణాలయ, జాయఁ బాసి
దుష్కులజయొకర్తుకే గ్గొనినక్రూరుఁడు కిల్బిషమూర్తియై గ్రాసనజామిలునకు నంతకాలమున మీఱినప్రేముడి నాత్మనంద
నుర్ బిలిచినయంత్రమాత్రన లభింపదె మోక్ష మనంతు
నాఖ్యతోన్.

గీ. గంగయొడ్డున దాశేశుకన్య సత్య
వతి పరాశరుకృపఁ గన్న వ్యాసమౌని
వరుఁడు కానీనుఁ డవ్వానిపౌత్రులెల్ల
భ్రాతృజాయారతుల్ కారొ వారనఘులు?

వ. ఇంత యేల,

తే. హరునిప్రతికృతి దుర్వాసునంతవాఁడ
యలిగి సలిలాశనమ్మునఁ దలఁప నీకు

నెగ్గు చక్రానలజ్వాల భగ్గుమనఁగ
నొడలు పొందఁడొ మందుఁడై యిడుమ లెన్నొ ?

క. చిత్రమ్ము భూతభావన,
చిత్రమ్ములు భూతతతులు, చిత్రమ్ములలోఁ
జిత్రమ్ములు కర్మమ్ములు,
చిత్రము లెంతేనిఁ గర్మసిద్ధులు శక్తుల్.

గీ. ఎఱుఁగఁగారాక తన కింత మఱుగునఁ బడి
యున్న ప్రాక్కృతసుకృత మేపొందుచుండుఁ
బుణ్యకర్మపరంపరఁ; బూనఁగ సమయ
మొసఁగు నెపుడొ దుర్లభమయి యొసఁగుఫలము.

తే. కృతశుభాశుభకర్మ మొకింతయేని
నుపశమింపక నిలువయై యుండి యటులు
జన్మజన్మానుగామియౌ; సమయమున ఫ
లించి యుచితఫలమ్ముల నిచ్చుచుండు.

వ. అటులయ్యు సమృద్ధంబులు పుణ్యంబులనడుమ సుదారుణం
బయ్యు దురితంబు కరువలినిడిన కప్పురంబురకంబు నెఱయఁ
గ్రమక్రమమ్మున హరించి యగోచరమ్మగు; నిఁక సల్పా
నల్పాయాసనమాలోచన మాచరింతము.

తే. విధి మహత్తర, మది తుది వెలయఁజేయు
ఫలిత మొకదోమనోరంత; స్వల్పము విధి,

వలనుపడు నొకత్రుటిఁ బూర్తిసలుపఁ, దత్ఫ
లమ్ము మేరువు; పోలుచుఁ గర్మమ్ము లిటులు.

వ. సింహాదిమంత్రోచ్చారంబును, పంచగవ్యనిషేవణంబును, జలాగ్న్యాదిప్రవేశంబును మున్నగఁగల బహులాయాస కరంబులు నియమంబులయుఁ దత్ఫలంబులయు స్వరూపం బులు గమనింపుము. ఎట్టెట్లో తుదముట్టించినఁ బూర్వో దిష్టవిధానంబులకుం గలుగునది శాస్త్రప్రోక్తపరిమిత ఫలంబ. వేయేల

ఆ. అల్పనాశ మధిక మాయాసముం గూర్పఁ
జాలువిధిని; మిపుల స్వల్పమున మ
హాత్ప్రణాశమవును; నగ్నికణ మ్మొండు
దూది కొండయంత తుడువదొక్కొ!

గీ. విప్రగోశిశుహత్యలు వేలకొలఁది
గురుకళత్రనిషేవణకోటులుఁ మ
హోగ్రపాపశతమ్ములు నుక్కడంగు
నొక్కమాఱు శ్రీహరినామ ముచ్చరింప.

క. కావున శాస్త్రప్రోక్త
మ్మౌవిధి స్వల్పమ్మ యయిన నాచరితమ్మై
వేవేగ పాపనాశము
గావించును సుకృతవృద్ధి ఙ్ఞానాధాగ్ర్యా!

ఆ. పాపహేతుఁ దలిర్చుభావకర్మాధిక్య
మున ఫలాధికతయు మొనయుఁజుమ్మ;
ధర్మగతులు సూక్ష్మతమములు తత్ఫల
ముల నెఱుంగువార పుడమి లేరు.

వ. అటు లవుటంజేసి

క. ఓధరణీధవ ! యొసఁగుఁ
మాధవనాథ మ్మసంతమహిమాఢ్య మ్మా
మాధవమాసమ్మున నా
రాధకులకు మాధవుండు ప్రథితఫలంబుల్.

చ. అరుణుఁడు మేషరాశిగతుఁడై యలరారెడునప్పుడోపు నే
పురుషుఁ డుషస్సువేళ హరిపూతపదద్వయి మానసాంబుజాం
తరమున నుంచి యెంచుచు నొనర్పఁగ స్నానజపవ్రతాదులం
బెరయ దవాన్నిపై భవము వీక్షణమేని నెనాఁడు భూవరా !

క. కావున నుషస్సుస్నాన
మ్మానై శాఖమున నాచరించి యనూన
మహా వైభవమున విలసిల
నీవును యతినింపుమయ్య నిర్మలచరితా !

క. అన నాలకించి యమ్మా
వనచరితుం డంబరీషవసుధాపతి నె

మ్మన మానందరసోత్సే
కనిర్భరమ్మయి యెలర్ప ఘటితాంజలిగ్నై,

వ. మహాత్మా! యీవృశము లశ్రుతపుణ్యులు వినుచుపి శేష
మ్ములనెఱింగించి నాపుట్టువు కసఫ్గతం గూర్పంగ దె
యని వేడుడు —

ఆ శ్వా సాం త ము

క. శర్వపురోముఖసర్వసు
పర్వగణారాధ్యపాదపద్మద్వయ ! ని
ర్గర్వుడు మాకృతినేతకు
సర్వాభీష్టమ్ము లొసంగి సాకవె శౌరీ !

మాలిని. విపులవిమలకీర్తీ, వేదవేదాంతవర్తీ,
యపహృతసుజనార్తీ, యద్వయానందమూర్తీ,
లపనమృదులశీలా, లబ్ధవర్ణానుకూలా,
క్షపితకలుషజాలా, కంధిజాచిత్తలోలా !

ఇది శ్రీశ్రీవత్ససగోత్రపవిత్ర, చిదంబరస్తోత్ర నాగ
భూషణసుధీవరపుత్త్ర శ్రీ బాలాత్రిపురసుందరీగర్భ
శుక్తిముక్తాఫలాయమాన ప్రభాకర, లక్ష్మీత్ర
నరసింహశాస్త్రిసమాఖ్యానప్రణీతంబైన కాల
భాగవతముద్వితీయస్కంధమునం బ్రథ
మాశ్వాసము సంపూర్ణము.



*　　　　*　　　　*

మ. పరమార్థప్రదముల్ శుభావహము లవ్యాజమ్ములౌ భక్త
సచ్చరితమ్ముల్ విన సావధానమతి నీచాయన్ లిఖింపన్
సుదుస్తరభాగ్యమ్ము లభించె నన్న మన కాశ్చర్యంబె,
నినొబ్బలుమేలిరసజ్ఞోత్తముతోడి చెల్మి చన దోలిన్ వ్యర్థమై
యెన్నఁడున్.

*　　　　*　　　　*

శ్రీ రామ

## కాలభాగవతము—ద్వితీయస్కంధము

# వైశాఖమాహాత్మ్యము

## ద్వితీయాశ్వాసము

శ్రీవనరుహపత్రాక్షీ
పావనకరుణాకటాక్షపాత్రాన్వహసం
భావితనిస్తులవైభవ,
శ్రీవేంకటనాయకాఖ్య, శిష్టేష్టగుణా!

### దేవశర్మోపాఖ్యానము

వ. అక్కథకగ్రామణి శౌనకాదుల కిట్లనియె నట్లు వేఁడిన యంబరీషున కంబురుహాసనతనయుం డీపొలుపునఁ బలికె. నృపకులతిలకా! మాధవమహిమముం దెలియం బలుకు

పురాతనకథానకమొకం డెనకమెనకు నయ్యది వినుపింతు నవహితమతి నాలింపుము. తొల్లి రేవాతీరమ్మునం బరమపవిత్రమ్మవు నమరకంటకమ్మను తీర్థరాజమ్మునం గౌశికనందనుండు దేవశర్మయను ద్విజుం డొకండు వసించుచుండు నాతండు—

చ. కుడువను గూడు కట్ట నొకగుడ్డయు లేమి భరింపరాని పె
న్నెడఁదల నొందుచుం దనువు వీడ ననుక్షణముం గడంగు నా
తఁడ తనకూర్చు నెచ్చెలి లతాలలితాంగి గొనాలప్రోవు మే
ల్నడవడి ప్రేమ చుట్టి మఱలన్ మఱలన్ గమకించుచుండుఁ
దాన్.

వ. అటులయ్యు

చ. అనయముఁ జూచి చూచి తనివారక కైరవమిత్రు గెల్చి
పొల్చినమెఱుఁ గీసనొ బుడుత లేసగు మోమును ముద్దుగొం
చుఁ గాంచినచెలితోఁ బ్రతోషమును జెందఁగ నువ్విళు
లూరు నాతఁడుం, దనయులు లేనిదీనుల మనస్థితి యిట్టిద
కాదె భూధవా!

వ. ఆతలంపునన

చ. ధనము గడింప, నింపయి ముదమ్మును గూరుచుసంతతిం
గనం బొనరిచి వేనవేల్జతనముల్ నిహతాశుఁడై విషణ్ణ
మానసమున నున్న కూరుచుమనఃప్రియు డాసి యువాని

మానినీమణి సుమనాఖ్య యి ట్లను సముంచితవాక్స్మృతి నో
కర్కానాఁ డినా!

చ. అనఘ ! సుఘోరదుఃఖనివహమ్ము మన మిాహృదయమ్ము
కార్శ్యముం గొనినటు తోఁచు, మోహ మొదఁగూర్చిన
మూఢత నిట్లు చింతిలం జనునొకో, తీరిపోవనివిచారమునం
దనుశోషణంబ కా కెనయుఫల మ్మొకండు గలదే? వాఁదే
కలగుండు బాయఁగఁగ ?

గీ. బసుమ మొనరించు జీవము వాసియున్న
యెండుపుల్లలఁ జిత, చింత గండుమిగిలి
నిండుప్రాణిని లోలోన నిర్దహించుఁ
గోటరమ్మునఁ గల చిచ్చు కుజమునోజ.

వ. కావున నోవల్లభా ! శుభ మభిలషించునంచితుఁ డిద్దాని
నేరుపున దూర మ్మొనరుపంజను నంతియుకాక,

తే. నిత్యసంతోష మదియె పున్నెమ్ము సుఖని
ధాన మవును, దురంతచింతానలప్ర
దహ్యమానత పాపమ్ము తాపకర మ
టంచు భగవానుఁడే వచియించె మున్ను.

వ. మఱియు లోభబీజమ్మును, మోహప్రరోహమూలమ్మును,
ననత్యస్కంధమ్మును, దురాశాశాఖాబహులమ్మును, మద

మత్సరకుటిలత్వాదికచ్ఛదమ్ములును, కుమనస్సూనమ్ములును, ననృతపరీమళమ్ములును, నజ్ఞానఫలబంధురంబును నయి లోభపాదపంబు డంబుమీఱుఁ; బాషండషండ చోరక్రూరకూటపాపిస్వరూపంబు లవుపక్షిగణంబు లనయమ్ము నమ్మ్రాని కొమ్మల గుములుగుములుగఁ దిరుగాడుచుండు; నధర్మరసపూర్ణమ్ములయి తత్ఫలమ్ము లెల్లఱయుల్లమ్ము లల్లన నాకర్షించు; నంతఃకలుషోష్ణమ్మును బహిశ్శీతలమ్మును నవు నమ్మ్రానినీడం జేరి పూరుషుం డొడలు మఱచి నిదురించి మేల్కొని తృష్ణాపీడితుండై పండినయాపండ్లం దిని రుచిరమ్మయ్యు సురసరణి నప్పటికప్పుడ తలత్రిప్పి దుప్పతిలంజేయు తత్ఫలరసమ్ము ప్రభావమ్మున నిట్టట్టూగుచు కనులు గానక యొడలియెఱుకయు లేక పతనోన్ముఖుండయి కలగుండుపడును నింతయు నిక్కువమ్ము. కావున ధనపుత్త్రమిత్త్రకలత్రక్షేత్రసంబద్ధంబులు దురంతచింతాతంతువుల నొకమ్మడి మానవుం డనూనమ్ము జ్ఞానఖడ్గమ్మునఁ ద్రెంచి వైచి యఖండసుఖం బెనయంజను నని వెండియు నవ్విచక్షుణ యిట్లనియె.

ఆ. పడయనేర్తు నెఱులు కొడుకులఁ గోడండ్ర
నేడ నీడులేక యెసఁగుకలిమి
ననుచు రేయి పవలు నధికచింతాక్రాంతుఁ
డౌట మూఢజనులబాట సూవె.

ఆ. జనని, జన్మదాత, తనయుఁడు, తనయులు
వనిత, పశువు, లిరవు, బాంధుజనులు,
గలుఁగు బూర్వకర్మకల్పితసంబంధ
వశమున, మును, వీరు, వారు నేరా!

క. అన దేవశర్మ యిట్లను
వనితా! నీయనినయాత్మభవసుఖమూల
మ్మును సంబంధవిధమ్మును
వినిపింపు మన సుమన యను విశదముగ నిటుల్.

పంచవిధపుత్త్రప్రశంస

వ. నాథా! నందనసుందరీమందిరప్రముఖంబులు ఋణానుబంధ రూపప్రాప్తంబు లందు న్యాసాపహారియు, ఋణసంబంధియు, శత్రుండును, లభ్యుండును, నుదాసీనుండును, ననఁ దనూభవు లైదు తెఱంగులవా రవ్వారల లక్షణమ్ములు వివరింతు నవధరింపుడు.

ఆ. ఒరుల కెఱుఁగరాక యొకయెడఁ దా దాఁచి
యుంచికొన్నసొమ్ము పొంచియుండి
యపహరించునతని కాత్మజుం డవుచుఁ ద
త్స్వామి పుట్టు వానిఁ జాల నొంప.

చ. సుమశరసుందరుండయి సుశోభనసద్గుణభూషణుండునై
యమలవచఃప్రకారుఁడయి యన్నిట నేర్పరియై కరగ్రహ

ద్యములును నైనమీఁద సగమాయువునంద త్యజించు
మేను శోకమున మునుంగఁజేసి తను గాంచినవారి ఋణమ్ము
దీరఁగ౯.

గీ. అంత నత్యంతశోకవిహ్వలుల యవుచు
నవని దొరలుచు నాత్మజా! యరిగితె మము
విడచి యిటు లంచు వాపోవుపితరులఁ గని
గాలిరూపుననున్న యాకన్నకొడుకు,

తే. "కనరు సిగ్గు న౯ గడుపారఁ గన్నవారు
వీర కాఁబోలుఁ, గాకేమి యీరకమునఁ
బరులవిత్తమ్ము కుత్తుకబంటితినిన"
సనుచుఁ బరిహాస మొనరుచుఁ గనలుకొనును:

తే. "అపహరింపక యున్నఁ బాపాత్ములవుచు
మీరు నాద్రవ్య, మిట్టులు దోరువాఁడ
నోకొ- చన నాయు వొకత్రుటి, నొందు డింక
నిట్టి యిక్కట్టులే" యని తిట్టు నతఁడు.

వ. ఇట్టికొమరుండు న్యాసాపహారుండనం బరఁగు నీకఋణ
సంబంధ యవువానిచంద మ్మెద్ది యనిన,

గీ. ఋణముఁ గొని కొంత యది వెండి రీణనైత
తీర్పక యయున్న దుష్కాలసర్పముఖము

నం బడినవానికిం బుట్టు నందనుఁడుగ
బుణముఁ దదియెల్ల రాఁబట్టుకొను నెపుడు.

వ. అట్టిదుష్కొడుకు

గీ. పలుకుఁ జెవులకు ములుకులపగిదిఁ దగుల,
మెలఁగుఁ దలలోని నాల్కఁగా నెలప్రసంగ,
సందు దొఱికిన ద్రుమ్చిలి సకల మొందొ
పాఱు, వారింప నలిగి యసువ్వారి మోఁచు.

గీ. ఆడు దుర్వాత మసత్యము, పాపుఁ బాపు
కల్లు దాఁ ద్రావి యుదరము చిల్లుపడఁగఁ,
ద్రాఁటు బిగియించి కుత్తుకఁ ద్రొక్కిఁ బండ్రి
దౌడ లూడఁగఁ జఱచును దాఁ దుఁ గాల.

క. గవ్వయును మిన్నులకుండఁగ
నవ్విధి నవ్వానికతన నడఁగి విభవముల్
నెవ్వగ నంగదలం బడి
యవ్వృద్ధులు పితరు లడలి యసువు వొఱంగన్.

వ. శ్రాద్ధాదులం ద్యజించి మించినగరువమ్మునం దిరుగుచుఁ దనవచ్చినపని నెఱవేఱిన వెనుక మృతింగొను నిఁక రిపుపుత్త్రప్రకారం బవధరింపుము.

గీ. ఘోరవైరానుబంధమ్ము కారణముగఁ
బెరయ నోడవినకోషుసుఁడు సిన్ననాటఁ
గోలె గాలుసేతులఁ గ్రుమ్మి గోలవెట్టి
నేఁడుఁ బోర్వెట్టి విసిగించు నూఁడు బలము.

క. ఆటలపాటలనడుమన
మాటికి మాటికి హఠమ్ముమై వచ్చి యమ
ర్షాటోపమ్మునఁ బితరులఁ
బాటింపక యిడిన నేది బాధించుఁజుమా.

క. ఆయదియె పరిపాటిగ
నాయధముఁడు తొంటిపగకు ననుకూలముగా
నాయారీతుల ననయముఁ
బాయక బాధించు వారిఁ బ్రజ సుఖ మిడునే!

వ. నాలవవాఁ డవు లభ్యుంపు

తే. ఉదితుఁడైనంతమాత్రన యొప్పనారు
పితరు లానందభరదంతురితహృదంత
రులయి; యాలవానిగుణవత్త్వకలనఁ గొలము
మివుల వాసి వన్నియఁ గాంచు మీఱి పేర్మి.

తే. కనఁడు వైముఖ్యముం బితృజనులయానఁ
జనఁ డధర్మవర్తమ్మున, ననఁ డెనాఁ డ

సమ్మత మ్మగువచనమ్ము, శ్లాఘ వినఁడు,
ఋణము త్రివిధమ్ము రీణ మొయ్యనఁ బొసఁగ్సు.

వ. అలభ్యమ్ము లుత్తమలోకమ్ము లవ్వానియుఁ బడయనమ్మన లభ్యమ్ములయి యెలర్చుకతన నతఁడు లభ్యుం డనఁ దనరు. నయిదవువాఁ డవు నుదాసీనసూనుండు

క. పలుకఁడు పిలిచిన, వినఁడుం,
దిలకింపఁడు, కొనఁ, డిడండు, తినఁబోఁ, డరుస
మ్మెలయఁడు, కినియఁడు, మను ని
చ్చ లుదాసీనత వహించి స్తంభము పోలెన్.

వ. అని వెండియు

గీ. తలఁప దాసదాసీజనమ్ములు పశుగ
ణమ్ము లేనుంగులును వారువమ్ము లాల
మంద నందను లిల్లాలు మనికిపట్టు
కూడు ఋణముసంబంధము తోడుపడఁగ.

ఆ. అట్టులౌటఁ దొంటిపుట్టువునం బర
న్యాసహరణముఖ్య మఘచయమ్ము
పగయు నేరితో నెఱుఁగ మని సంతస
మొందఁబోక చింతఁ జెందెదేల ?

ఆ. ఒరుల కీక కాసు, నొసులపాలిటియది
ప్రముచ్చిగింప కిటులు వచ్చు భాగ
ధేయ మనఘ! యిట్టిదెస లేల సుతధన
మ్ముల, కవానివలనఁ గలదె సుఖము?

ఆ. కలుగ నున్నయద్ది కలుగు నవశ్యము,
కలుగరాని దెపుడుఁ గలుగఁబోదు,
కానఁ బాసి చింతఁ గాంచుమా సుఖమన్న
ననియె దేవశర్మ యాపె కిటులు—

క. వనితా! మన ముబలాటము
నెనయఁగ ధనమును గడింప నెన్నఁడు నాకుం
దనయులఁ గనుటకుఁబలెఁ గా
వున నెవ్విధినేని వలయుఁ బుత్త్రులఁ బడయన్.

చ. అన సుమనాఖ్య యిట్టులను: నట్టులయా నెడ నాథ! వంశవ
ర్ధను, గుణరత్నహారినిధి, రమ్యయశోవసథున్, సుతుం గనం
జను, నిసదుల్ గరాసు లవిచారులు నిర్గుణ లేల; సత్యశౌ
చనియమదానమానితులు సత్పురుషుల్ గనువారు
సత్సుతున్.

వ. మఱియుఁ దత్ప్రాప్తికనన్యసామాన్యంబులు జపతపోవ్ర
తాదు లనేకంబులు విధివిదృష్టవిధానంబున ననుష్ఠింపవలయు;
సవియెల్లఁ గాల్పుణ్ల లప్రమహానీయులదయ నెఱుంగందగి

యుండుఁ గావున, నిప్పుడే సర్వజ్ఞుండును బ్రహ్మనిష్ఠాగరిష్ఠుం డును నగువసిష్ఠమహర్షిం డాయం బోయి యాతనివలన మామూలాగ్రముగ నెఱింగికొని యనువగు సంగతిం బడయు మని నుడువుడు గడుంగడు నాదృతి

ఉ. ఆయవనీసురాగ్రణి రయంబ వసిష్ఠమహర్షిసోమునిం
డాయఁగఁ బోయి భక్తి మిన్నులం బొనరించి నమస్క్రి
యాదు లాధ్యేయపదాంబుజద్వయున కిట్లను నోమహా
నీయ! భద్రసంధాయుక మైన నీమహితదర్శనలబ్ధి ఫలించెఁ
గోరికల్.

క. దీనుఁడఁ గౌశికభూసుర
సూనుఁడ సంతానవిత్తశూన్యుఁడఁ జింతా
నూనానలభస్మీక్రియ
మాణనిజావయవుఁడను సమంచితకీర్తీ!

గీ. రీణమై తలిర్ప ఋణము పైతృకమెల్లఁ
గొడుకు పేరినిధిని బడయువెరవు
నెఱిఁగికొనఁగ మీకడవఱలుకూరిమి నిగని
పనుప వచ్చినాఁడఁ బరుగువాఁజె.

గీ. లేమిఁ గొడుకులుం గలిమి గోడు గుమవఁగ
నెట్టియఘము దొంటిపుట్టువున నొ

సర్చియుంటి, ధనము నందనులం గాంచు
త్రోవఁ దెలిపి నన్ను బ్రోవుమయ్య.

వ. అని పదంబులం బట్టి విడువకయున్న యవ్వానిం జివ్వునఁ హత్తుకొను నెనరున లేవ నెత్తి యమ్మహర్షిసత్తముఁ డి ట్లనియె——

క. విను కౌశికనందన! ని
ర్ధను లెంతే ధన్యతములు, ధనగతముల్ తీ
ఱనిలఘుములు సర్వమ్ములు,
కన నెంతటిసుకృతి వీవు కాంచ వవానిన్.

తే. ఏల సంతాన? మద్దాని మూలమున సు
ఖ మ్మఖర్వమ్ము గాంచఁగఁ గలిగి రేరు?
పడసి యరువది వేవురు కొడుకుల మును
సగరుఁ డొందినయంగదచాయ వినవా.

తే. ముక్తిపదసమారోహణాసక్తిని నధి
కారివై యున్న వానికిఁ గన్నవార
లున్న లేకున్న నేమియగా నన్న! శుకున
కాత్మభవు లెందఱో సరణాతిగునకు!

వ. ఇది యెల్లఁ దొల్లి భవత్పల్లవాధరి సుమన సముచితగతి వివరించె నయ్యది పాటింపకుంటి వింతకు సంతానోదయ

ప్రరోధకమయి పురాకృతదుష్కృతఫల మ్మొకఁ జేటీసిన
నిను గాఁటియవెట్టు నది యెయ్యది యంటివి,

చ. వెనుకటిపుట్టువందు ఖిలవృత్తివి దంభపరుండవు ప్రగ్రహో
పనుఁడ వధర్మకర్ముఁడవు పాపరతుండవు దానతీర్థసే
వననియమాది శూన్యుఁడ వవాచ్యగుణుండవు నాల్వ
జాతిలో జనిఁ గని తెన్నియో పసుల సాఁకితి వుబ్బుతఁ
గర్షకుండవై.

గీ. తొల్లుపట్లు దున్నకుఱ్ఱలఁ, గోడెల,
నాల, వానిపేడ, యమ్మి యమ్మి
యదియ వృత్తిగాఁగ నతిలోభివై సొమ్ము
కూడఁబెట్టితీవు కోట్లకొలఁది.

గీ. కన్నవారికేనిఁ గాసంత తెలియక
యుండునట్లు దాచి యుంచితీవు
పుడమి దాని, నిటులు గడువ కొన్నేఁడులు
కాలభుజగవదనకబలమైతి.

గీ. ఈవియన్న నెఱుఁగ కేపక్షినామమో
కుటిలవృత్తి లోభగుణము సూప
నేపు విత్తముం గడించినకతమున
ధనము సుతులు లేమి నెనయ వయ్యె.

గీ. అట్లు కాలధర్మ మంది తీర్థాటన
మాచరించునొక్క యనఘమతికి
నాశ్రయమ్ము నొసఁగి యవ్వానిదయ మెయి
మాధవాఖ్యమాసమహిమ మెల్ల.

క. విని తత్స్నాన మొనర్చుటఁ
గొనితి వవనిదేవత, ననుకూలవతి కన
ద్గుణభూషణ యోషామణిఁ,
గని తే వైశాఖమాసఘనమహిమమ్మున్.

వ. అయ్యదియ యియ్యదనున నయితము నీ కఖిలమంగళంబు
లొసంగి యెసంగుం గావున—

ఉ. మాధవవల్లభమ్మయి సమస్తశుభంకరమై తలిర్చు న
మ్మాధవమాసకల్యమున మజ్జనముం బొనరించి మాధవా
రాధన సేయుమా దృఢతరమ్మగునిష్ఠఁ, గొనంగలాఁడ వెం
తే ధనధాన్యవైభవము లీడ్యపదాఢ్యులఁ బుత్త్రపౌత్త్రులన్

వ. తడయక యిట్లు జను మనిన దేవశర్మయు శర్మార్థియయి
సాష్టాంగదండప్రణామంబు లాచరించి వసిష్ఠునానతిం
గొని వడివడినడల నిజావాసమ్ము డాసి సుమనాసహిత
మ్మగ నప్పుడ వెడలి తీర్థంబులు సేవించికొనుచు గంగా
తీరస్థమ్మగు [illegible] క్షేత్రమ్మనదగుం జనుసంత మాధవ

కరుణావిశేషమ్మున మాధవమాస మ్మెఱిఁగించుటయు
దనపురాకృతసుకృతమ్ముగాఁ దలంచుచు సయ్యాగించితుండ

క. విధిదృష్టవిధానమ్మున
నధిగతసనియమయమవ్రతాదరుఁ డనుచున్
విధిశర్వాదిసమర్చ్యుని
మధురిపు నర్చించె నిరుపమానసుభక్తిన్.

వ. తత్పౌర్ణమాస్యాదివసంబున

క. తొలుత నిడి నూవు లావల
వలువలు బంగారు వెండి వత్సాఢ్యల్ గో
వుల నవనీదేవుల కిడి
సలిపెన్ మృష్టాన్నకలితసంతర్పణముల్.

గీ. అట్లు మాధవసేవన మాచరించి
యరిగి రాదంపతులు స్వగేహమున కంతఁ
గొంతకాలమ్ము సనినయనంతరంబ
కనియె సుమన సలువుర నందనుల లలిని.

ఆ. అటులు జాతపుత్త్రులాప్తనిస్తులవైభ
వులును నవుచు వారు భూరిసుఖము
లనుభవించి కాంచి రపవర్గముం దుది
నలఁతియె మధుమాసమతులమహిమ!

చ. సారిదిఁ బాసంగఁ జేసి పొలుచుం బురుషార్థము లిత్థముల్
సముద్ధరణ మొనర్చి పేర్చు భయదంబు భవాంబుధిఁ
గూలి కూలనౌనకులను నాచరింపఁబడున్నా నజపాదిమహా
ద్విధాన మాస్మరపితృమోదవర్ధనము మాధవమాసము
నందు భూధవా!

క. అనిన విని యంబరీషా
వనినాథుం డనియె మాధవస్నాన మొన
ర్చినమాత్రన దుర్లభము న
వనిదేవత్వమ్ము గొనుట పరమాద్భుతమా.

క. ఎటు లల్పాయాసమ్మున
ఘటియించు మహాఫలమ్ము క్రన్న నుడివి హృ
చ్చటులత మానుపు మనఁ బ్ర
స్ఫుటముగ వనజాతసూతిసూతి యిటు లనుఁ.

ఆ. తద్ద సూక్ష్మములయి తనరు ధర్మగతులు;
వాని సూరిజనులునేని నెఱుఁగ
నేఱ. రంను మెఱయు నెఱి మాధవస్నాన
దానముఖ్య మవు విధానమెల్ల.

క. ఇది యెల్ల మున్న తెలిపితి
మదిఁ బాయవు సందియమ్మ, మధుమాసమునం

దొదవఁ దమి స్నాన మొనరించి
తుది స్వైరిణి విప్రవనిత దొరసె శుభంబుల్.

వ. ఆవృత్తాంతంబు సాంతంబుగ నెఱింగింతు సావధానమతి
నాకర్ణింపుము.

చిత్రోపాఖ్యానము

ఉ. వాసవసన్నిభుండు నృపవర్యుఁడు కాంతిపురేశుఁడొ విశ్వా
దాసుఁ డనంతకీర్తి సముదారగుణాఢ్యుఁ డవానిపుత్త్రి యు
జ్జ్వాసనురాణి విద్దెల, ననంగునియాఁబవతూపు రూపునన్,
శ్రీసతి కాటపట్టు లివురించినయాపెగొనమ్మ లన్నియుక్.

క. ఆదుహితృవతంసము ది
వ్యాదేవికిఁ గన్నెప్రాయమందునఁ జేత్రో
మోద మిపుర్పఁగఁ బెండ్లి ది
వోదాసుఁ డొనర్చునిచ్చ పూని కడంకన్.

గీ. వెదకి వెదకి వివిధవిషయాలఁ గల రాచ
కొడెగాండ్ల నెల్ల నీడురాఁగ
నోప రనుచుఁ గడకు రూపదేశవిభుండు
చిత్రసేనభూపశేఖరునకు.

వ. తనకూఁతు నీఁ గృతనిశ్చయుం డయ్యె నంతఁ బగినాఁడూవ
సరమ్మున—

గీ. మాఱుమ్రోయ దెసలు మొఱయఁ దూర్యధ్వనుల్
సంతసమ్ము నిండఁ జవికపయిని
నధివసించువాఁడ యట్టె మేను దోఁచె గెఁ
జిత్రసేనుఁ డతివిచిత్రగతిని.

వ. అవ్వానిపైతృకక్రియ లన్నియు ముగిసినవెనుక నొకనాఁడు దివోదాసుండు పండితుల రావించి కూఁతుం దలంచి కడుంగడుఁ గుందుచు నిట్లనియె—

చ. ఎఱుఁగదు పాపపుణ్యగతు లీపసికూన సురూప కన్య తాఁ
దఱుఁగనివైరవృత్తి మతిదప్పినతాత యనుంగునాయువుఁ
గుఱుచసనేసె, బీటువడె గుండియ పేరిటిగోడ గోడ్పమై,
నెఱుఁగ వచింపుఁ డితఁడిని నే నొనరింపఁగనైన కర్జముఁ.

వ. అనిన నవ్విచక్షణు లూరక శోకింపకు మనుచు ని ట్లనిరి.

ఆ. కనిసఁ బెండ్లివేళఁ గాలధర్మము, సన్న్య
సించి చనిన, నుపశమింపఁబోని
రోగభీతి విడచియేగిన వరుఁడు క
న్యకకుఁ బెండ్లి మగుడ న్యాయహితము.

ఆ. అపుడు కాద యేని నాకన్నియ రజోవ
తి యవుపిదపనయినఁ దివురఁ బెండ్లి
సలుపు టొప్పు ధర్మశాస్త్రమ్ము లిమ్మాడ్కిఁ
బలుకుఁ గాన నటులు సలుపు మధిప !

వ. అన దివోదాసుండు నట్లు యొనర్చు తలంపునఁ దన యనుంగుకొమరితం బుష్పసేనుండను మహీజానికిం గూర్చు గృహిణిగా నిచ్చు నిశ్చయమ్మున నుండె నంతఁ బెండిలి దినమ్మున రెండవుసల్లుండును

గీ. ఉన్నవాఁ డున్నయట్టుల కన్ను మూసి
పెద్దనిద్దురవూయె వై మొద్దువాఱి
దోరి రీరీతి వరు లాచకోరనేత్ర
నొంద నరుదెంచి యిరువదియొకరు లలిని.

గీ. అంత సంపూర్ణయౌవన యాత్మసుతకుఁ
జాటఁబంచె స్వయంవరోత్సవముఁ దుదిని
నాదివోదాసుఁ, డరుదెంచి రవనిపతులు
మిత్తి చెయిసాచి పిలువ నమ్మోలఁత పేర.

గీ. విరులదండఁ గొని యొకఁ డుప్పరిగపయిని
రాజలోక మాలోకించురాజవదన
రాజనందనఁ గనుఁగొని రాజులెల్ల
నేను నేనంచు నెగసిరి నీతి దొఱఁగి.

గీ. అదియ పెనుపోరుగా మాఱె యవనిపాలు
రెల్ల అన్యోన్యమర్దన మేపుమాప
నరిగి రొకత్రుటి జమునింటి కతిథు లవుచుఁ
గలు చవింగొని మును యాదవులవిధాన.

వ. అట్లు నింద్యజన్మమ్మున గండుమిగిలి యొకుమ్మడి రా
కొమరులగుండెలబిగి సడలించునించువిలుకానిములికి యనఁ
జను దశరథతనయకుం గరగ్రహణమహోత్సవ మనుకొనిన
దనుకొనినయట్లు కాక చీకాకువడి శోకించుచు దివో
దాసుం డొకనాఁడు జాతూకర్ణుండను దమపురోహితుం
బిలువంబంచి కృతసశిరోవందనుండయి దేవా! దివ్యాదేవి
నేదేఁ బురాకృతదుష్కృతఫలితమ్మ వెన్నంటియున్నం
గ్రన్ననఁ దెలిపి తన్నివారణోపాయ మ్మనుగ్రహించి
వచింపు డాచరించుకొనువాఁడ నని వేఁడిన విని జాతూ
కర్ణుం డిట్లనియె—

క. ఓవసుధాధవ! దివ్యా
దేవీప్రాక్తనచరిత మతివిచిత్రము పా
పావేశపరిత మ్మి
ట్టే వివరించెద విను మవహితమతి వపుచుఁ.

మ. ప్రథితిం గాంచుఁ గిరాటుఁ డొక్కరుఁడు శ్రీవారాణసీ
క్షేత్రమం దధికస్మైౖ విభవ మ్మిపుర్వఁగ సువీరాఖ్యుఁ;
మహాపాపశేవధి చిత్రాఖ్య యవానిచాన కలహవ్యాపార
దుర్వార నిత్యభవోద్భర్తన సత్యదూర పరిణష్టాచార
దుష్టాత్మయా.

గీ. తవిలి వెలిచవిఁ దను నిరతమ్ము నేచు
కారణమునఁ ద్యజించి సువీరుఁ డావెఁ

బరిణయమ్మాడె నోర్తుక భవ్యచరిత
సుమతిపేరున నొప్పారుసుందరాంగి.

క. సుమతిసహాయుండై సౌ
ఖ్య మలేఖ్యముఁ గాంచె మించి యంచితుఁ డతఁ డం
త మెఱుంగని సంతసమున;
సుమతిగలాఁడలక కాదె సుఖము లేవేళన్.

తే. అట్లు పతిపరిత్యక్తయై యఘచరిత్ర
చిత్ర ముక్తసత్పథభయాపత్రప యయి
జారపూరుషవారమ్ము సాయపడఁగఁ
దిరిగె దేశదేశమ్ము లుద్వృత్తి హాత్తి.

గీ. కడకు నాగపూర్వమ్ము నగరమునందుఁ
బడుపువృత్తి నివాస మేర్పఱచుకొనియె
నాపె గడియించినయొడమె యంతు లేక
పెరిగె బిరబిర లుబ్ధునివిత్తమట్లు.

వ. ఒక్క నాఁటిసాయంతనసమయమ్మున నవనిసురుం డొక్క
రుండు

గీ. తీర్థసంసేవనాభిరతిం జివుర్చు
చిత్తమున నెల్లపట్లు లీక్షించి యచటి
మూర్తులం భక్తిఁ గీర్తించి పొలుచుచు సరు
దెంచె నామెగేహమునకు యదృచ్ఛఁ జేసి.

క. లో నడు గిడుచె తడవుగ న
నూనచరిత్రుం డతఁడు కనుంగొని చిత్రన్
సూనశరశరశతాహత
మానసుఁడై ధృతి దొఱంగె మనుజాధీశా !

తే. పాదసంవాహనస్నానవస్త్రవీజ
నేష్టమృష్టాన్నభోజనహృష్టపుష్టుఁ
జలిపి కమ్మనివీడె మొసఁగి విలాస
గతుల నలరించెఁ జిత్ర యాఘఘ్నమనీషి.

చ. కడలుకొనంగ సంగజవికార మవారిగఁ బొఱుఁ డానిశం
గడపె మనోజ్ఞరూప, సుమకార్ముకునాఱవతూపు చిత్ర
తోఁ బొడవవు నూఁకృతుల్, ననుచుముద్దులు, హద్దులు
లేని కౌఁగిలుల్, విడివడు కేశపాశములు, వీడినవల్వలు
మించు సంచులన్.

క. వఱువాత మేల్కని యతం
డఱిముఱిఁ జననున్నవాఁడ యనుఁ జిత్రకు నో
మెఱుఁగుంబోడి ! నిక్కువ
మెఱుఁగను నీఋణము నీఁగి యేఁగెదజాడన్.

వ. అయిన ద్వివిధఫలప్రదమ్మయి మును సర్మదాసరిత్తీరంబున
వేదవిత్తము లవుబ్రాహ్మణోత్తములవలన నాయెఱింగిన
తెఱం గొకఁ డెఱింగింతు వినుము.

తే. తనరు శర్మదనర్మదాతటమున శివ
దేహ మను పేరఁ బొలుపారుతీర్థ మొకఁ
డందు దినమణి యజ నున్నయపుడు మునుఁగు
నాతఁ డభవుఁడై శివుని దేహమ్ము నొందు.

వ. మఱియు నందు విధివిధానమ్మున

క. మాధవవల్లభనై తగు
మాధవమాసమున మునిఁగి మనుజుఁడు సేవఁగ న
మ్మాధవు నర్చించును. శ్రీ
యోధికుఁ డవ్వానిఁ దగుల వఘముల దొఱఁగున్.

క. కావున శివదేహమునకు
వేవేగమ యేఁగువాఁడవై, ప్రీతి గొలిపినన్
భావమ్మునఁ, బయనమ్మయి
భావిని! నీ వరుగుదెమ్మ పాపము లూన్పన్.

క. అన వెనసిన కెలసమ్మున
ఘనకిల్బిషపాత్ర చిత్ర కవలి యపుడె యు
య్యనఘుఁడు తోడుగఁ జనెఁ బా
వన మా శివదేహమునకు భవ మడఁచుదమిన్.

వ. విధివశమ్మున నమ్మఱునాఁడ వైశాఖమాస మ్మప్రుటయుఁ
గడుంగడు నరుసమ్మున నుబ్బి తబ్బిబ్బులవు చిత్ర నాధాత్రీ
సురవరుండు,

గీ. అంద పూర్వము దాని మాహాత్మ్య మెల్లఁ
దెల్లముగ వివరించుచు దినదిన ము
షస్సు వేళలఁ జేయించె స్నాన మఘవి
నాశనప్రవణము దా నొనర్చుచుఁ దమి.

గీ. చివురుదొడిగినయాసక్తి సిద్ధగేయ
మైన శివదేహమున వగాహమ్ము సేఁత,
దరినిఁ దన్మాసమహిమఁ దత్పరత వినికి
నిత్యకృత్యములయ్యె నా నెలంత కపుడు.

గీ. అనువుగానిత్రోవ గడించినదియ యవును
గాక తనదుసొమ్మెల్ల నాకలికిమిన్న
పాత్రులుం బవిత్రులచోటి ధాత్రిసురల
కొసఁగె మాధవార్పణ మని యెసఁగుభక్తి.

గీ. అట్లు మాధవసేవనాయత్తచిత్తు
లై సుదేవాఖ్యుఁ డావిప్రుఁ డాకిరాటు
నింతి చిత్రయు నంద వసించి రటులె
గడుపఁ దమయున్న జీవితకాల మెల్ల.

గీ. అటులు సమలు కొన్ని యరిగినయవలఁ జి
త్రాసుదేవు లిర్వు రాస దివము
జూరగొనిరి వింటె క్షోణీశవర్య! యా
చిత్ర నీదుకూర్చుపుత్రి యయ్యె.

గీ. పేర్చి శివగేహమున ము న్నొనర్చియున్న
స్నానదానఫలముగ నీచాననగరి
నిష్టమృష్టాన్నభోజనోర్వీశమహిత్ర
తాసురూపతాప్తిని దివోదాసభూప !

గీ. వరు లనేకులు పరిణయావసరమందుఁ
బొందఁగానేల పంచత్వ మంటనేమొ,
జారవృత్తికిఁ గడఁగి దుర్వార యవుడుఁ
గూల్చు దెందలి కొంప లీకులుకులాడి!

క. అనినం జకితము మనమున
ననియె దివోదాసభూవరాన్వయచంద్రుం
డనఘా! తన్నిష్కృతిగా
నొనరింపఁగవలయుఁ నెయది యొయ్యనఁ జెపుమా.

వ. అంత జాతూకర్ణుం డిట్లనియె—

తే. మానవాధీశ! యసమానమహిమ నతిశ
యిల్లుమాధవమాసమహీనవిధివి
ధాన మొనరిచి కాదె యీచానమిన్న
యున్నతస్థితి నొంది యిట్లొప్పుచునికి.

వ. విధివిధానమ్మునఁ గ్రమ్మఱ నయ్యదియ యొనరింపించుము.
పురాకృత మఘంబు మోఘంబన్న నింతియకాక,

తే. ఆసుదేవాఖ్యభూమీసురాన్వవాయ
కైరవాప్తుఁడు జనియించె వీరసేన
నామమునఁ బాండ్యదేశాధినాథుఁడవుచు
వాని కీయమ నొసఁగుమా పడఁతిగాఁగ.

క. అన వల్లెయని దివోదా
సనరాధీశుండు నటుల సలిపె బిరాన్
గనె దివ్యాదేవియు నె
మ్మనమున నరుస మెసఁగ నసమానము సుఖమున్.

వ. కావున,

క. గరుడగరుద్ద్వితయరవ
స్ఫురణ సమీరోదనములపోలుపునఁ బఱచున్
బిరబిర మాధవమూనా
చరితము స్నానమ్ముకతన సకలము లఘుముల్.

క. అలసులు కలుషపరీతులు
కలిమర్త్యులపై నపారకరుణ వొదల మం
గళదేవీప్రాణప్రియుఁ
డిల కీ మాధవము మాస మెలమిని బనిచెన్.

క. అధ్రువము దేహము, గృహ
మ్మధ్రువము, సతీసుతాదు లధ్రువులు, ధన

మ్మధ్రువము, దృశ్యము జగ
మ్మధ్రువ, మొనరింప నొప్పు సమ్మానవిధిన్.

తే. భాస్కరుఁడు మేషగతుఁ డయి వఱలుతఱిని
జనుఁడు పొనరుచువిధి యతిస్వల్ప మయ్యు
నదియె కూరుచు మేరువుసంతఫలము;
నపుడు మాధవసేవ సర్వార్థదమ్ము.

చ. అన విని యంబరీషవసుధాధిపుఁ డిట్లను [illegible]సం
దనునకుఁ ద్వన్ముఖాబ్జగళితమ్మగు మాధవకీర్తిసుధాస్రుతి
యనుమకరంద మెంత యిటు లానినఁ దృప్తిని గాంచఁ
బోదు నామన మెఱిఁగింపు మింక నసమానము తద్విభ
వమ్ము సత్తమా!

ఉ. ఉల్లము పల్లవింప నగుఁ డొక్కపరిం దలఁపోయుమాత్రనే
యల్లయఘమ్ములం జులుచు నేయఖిలార్థము లిమ్ముగఁ బొందు త
ద్వల్లభమై ప్రశస్తిఁ గను భవ్యము మాధవమాసదీక్ష నాఁ
గొల్లగఁ గూర్చి పేర్చుఁ దనుకోరినకోరుకు లన్న సంభ్రమమే!

చ. మరలనిభక్తి నేఘనులు మాధవమాసమునందు మాధవ
స్మరణము తత్పరత్వమున సంతతముం బొనరించుచుందు రా
పరమమనీషులే కద సుపర్వమునీంద్ర! కృతార్థు లన్నఁ; జె
చ్చెర వచియింపుమా, సకలసిద్ధికర మ్మగుతచ్చరిత్రమున్.

మ. అని వేఁడం గడువేడ్కమై నుబుక దేహ మ్మొక్కమా
ఱాత్మభూతనయుం డిట్లను నంబరీషధరణీనాథాన్వవా
యోడుకాంతున, క్రాంతముకుందసుందరపదానుధ్యాన
సమ్మానితాత్ము నినుం గాంచినయంత నాదుజని తోడ్తోఁ
గాంచె ధన్యత్వముల్.

తే. పరమభాగవతాగ్రణి! పారరహిత
మహిమ రహిమీఱుమాధవమాసవరము
గూర్చి నీ|మోల నీలీలఁ జర్చసేఁత
నర్మదాస్నాన మఖిలపుణ్యప్రదమ్ము.

గీ. వినుము తన్మాసమాహాత్మ్యపిశున మయిన
చరిత మింకొకఁడు వచింతు, సరవిఁ గనిరి
ముక్తికళ్యలమ్ము నెడల్చి పురుషు లేవు
రు మును రేవాజలమ్ములఁ గ్రుంకి భూప!

ప్రేతోపాఖ్యానము

తే. నిత్యసత్యవ్రతుండు నిర్నిద్రయశుఁడు
శ్రుతిశిరస్సారనిష్ణాతుఁ డతిచతురుఁడు
మాధవమ్మృదుపదాంబుజస్మరణరతుఁడు
మునిజనహితుండు మునిశర్మ యనెడుఘనుఁడు.

తే. మహితమాధవమాసోత్తమమున సర్వ
శర్మదము నర్మదాపుణ్యసలిలమందుఁ

గ్రుంకి కిల్బిషపంకము రూపఱించు
నుల్లసమ్మున నరుగుచు నొక్కచోట,

గీ. రూపు వెరసిన యత్యుగ్రపాపము లస
నల్లనై మేను లిఱు లీనఁ దల్లడిల్లు
నుల్లమున నల్గడల్ సూచు చొక్కమల్లె
దరిని దిగులొందుపురుషు లేవురను గాంచి.

వ. అవ్వారివికారమ్ము లాకారవ్యాపారమ్ముల కడుఁగడ [illegible]
యమ్మి వాడమ వీర లెవ్వారలొకో యని తల[illegible]
గడంగె నంతలోన యమ్మానిసు లేవురును [illegible]
నరుదెంచి యయ్యంచితుచరణసరసిరుహమ్ముల [illegible] ప్ర[illegible]
లేచి బద్ధాంజలులై యిట్లు విన్నవించిరి—

చ. ధరణిసురాగ్రగణ్య, విబుధ స్తవనీయచరిత్ర, సు[illegible], భా
స్కరశతతుల్యదీధితి ! నిజమ్ముగ శ్రీహరి నీవు, [illegible]ముల్
చరణసరోరుహద్వయరజమ్మునఁ బాపసముల్ [illegible] నీ
కరణిఁ జరించుచుంటివి పరికల్పిత [illegible] వేష మొప్పఁగన్.

తే. అనఘ ! భవదీయమ్ము సపదపంకజయుగల
దర్శనము ఘోరములు దురితముల పేర్మి
తూలమునకు స్పర్శన మది దొరయు నేర్పు
వార లేకద ధన్యులు వసుధలోన.

తే. ఘోరతరము లెందును బ్రతీకార మెఱుఁగ
నేఱనట్టివి దుష్కృతు లెఱిఁగి యెఱిఁగి
యొడలితిమురున నొనరిచి యిడుములఁ బడు
చుంటి మిటు, పూనవే మము నుద్ధరింప.

వ. అని వనరి వనరి యవ్వారలలో నొక్కరుం డిట్లనియె.

గీ. దేవ! పాంచాలపాలుఁడ, భూవరుండ
వీరవాహనుఁడను పేర, వేదవేత్త
విప్రవరు నొకరుని శబ్దవేధి పేరి
నిశితశరమునఁ గూల్చితిఁ బశువు నవుచు.

గీ. తత్ఫలమ్ముగ యజ్ఞసూత్రమ్ము శిఖయు
లేక క్రుమ్మరుచుంటి లలిఁ గలపుణ్య
తీర్థములనెల్లఁ బాయదు తీవ్రరూప
మెనసి బ్రహ్మహత్యాదోష మేచు నన్ను.

వ. ద్వితీయుం డిట్లనియె,

గీ. చంద్రశర్మాభిధానుఁడ ఝర్మసురుండ
మోహజాలసమావృతమూఢబుద్ధి
నయి వధించితి గురువరు ననద నైతి
వదలివైచిరి నను గూర్చుబందుగులును.

క. అట నటఁ దిరుగుచు నాశా
తటముల నిటఁ జేరినాఁడ దయ దయఁ బారఁ
మటుమాయ మొనర్ప వె యో
పటుధిషణా! నన్ను బఱచుపాపము నిపుడే.

వ. తృతీయుం డిట్లనియె,

క. అనఘా! రవణపుటన్నుల
కనుసన్నలఁ గీలుబొమ్మగాఁ గ్రోలి సురన్
పొనరిచితిఁ గులము భ్రష్టము
జని నవనీసురుఁడ దేవశర్మాహ్వయుఁడన్.

గీ. ఆసఁ గ్రుంకులిడితి నందంబుఁగల వాసి
నలరుపుణ్యతీర్థములలొ చనదు
పీసమంత యేని దోసమ్ము నాచేసి
కొన్నయద్ది యెటులు నన్ను బ్రోతో!

వ. తురీయుం డీతీరున నను,

క. కరుణావరుణాలయ! వి
ద్వరుఁడం బేరిటఁ గిరాటవంశజుఁడన్ బం
ధుర మోహావేశమ్మునఁ
గిరాతుఁడనయి, యలరారఁ గెలన మ్మెంతేన్.

గీ. తనయనుంగుధవునిఁ ద్యజియించి యేపున
రూపజీవినియయి రుసుము గూర్చు

కన్నయమ్మఁగూడి గడపితి మూఁడవు
నెలలు దాన మూఁడెఁ గలుష మింత.

గీ. తోడుపడుట నిట్టిజాడ నీజాడన
నలువు రీరుగూడ నిలువరించి
కొనఁగ నేర్చినాఁడ గుండియ యొకయింత
బాపుమయ్య నాదుపాపఫలము.

వ. అయిదవువాఁ డిట్లనియె,

క. ధనలుబ్ధత నాయుధపా
ణిన యయి తెరువరుల మున్ను నిష్కారుణముగాఁ
బెనువనటలపా ల్సేసితి
వినిపింపవె నాదునఘము వెడలెడుచొప్పున్.

క. అనునప్పురుషులపలుకులు
విని యను మునిశర్మ యిటులు, విగతముల భవ
ఘ్న నదురితమ్ములు, మనమున
ననుతాపము నింత కనఁగనయినకతమునన్.

గీ. మున్ను మునిసమాగమమునఁ బూజ్యచరణుఁ
డంగిరసుననుకంపమై నాలకించి
యున్నతెఱఁ గెఱిఁగించెదఁ గ్రన్నన వినుఁ
డది యమోఘఫలప్రదమై తలిర్చు.

సీ. దామోదరపరమ్ము దైవమ్ము, తృప్తిక
రమ్మవు నీవి యన్నమ్ముకన్నఁ,
దంద్రికంటె గురుండు, ధరణిదేవున కెస
యైన పాత్రమ్ము, గాయత్రి) నించు
మనువును, దనకుఁదాఁ బ్చవనితతోఁ దులదూఁగు
మిత్రము, ద్వాదశి మివులు వ్రతము,
దయకుఁ బెన్నుద్దియై తనరుధర్మము, నిత్య
సత్యవ్రతోపమాచారక్షితి,

హాయి స్వాతంత్ర్యమునకన్న, హార్షసమతఁ
జెల్లుసుఖమును, మాధవవల్లభమ్ము
మాధవాఖ్యానమాసనమానమైన
మాస మింకొకఁడు హులికి మహితులార!

గీ. అమ్మహోత్తమమాసమునందు నెవఁడు
నర్మదాజాహ్నవీయము నాజలమ్ము
లందుఁ గ్రుంకి యర్చించు ననంతు నతఁడు
దురితనిర్ముక్తుఁడై కాంచుఁ బరమపదము.

క. దుర్లభ మగు మగపుట్టువు,
దుర్లభ మీఖండమున సుదారితభవమై
దుర్లభ మివ్వైశాఖము
దుర్లభములు త్రిపథగాదిధునుల వృనుఁకలుల్.

చ. పరమపవిత్రమై భువనవల్లభవల్లభమై యలభ్యమై
పరఁగుద్వితీయమాసమున వారక శర్మదనర్మదాసరి
ద్వరమునఁ గ్రుంకువారు కనువారు విదారితఘోరపాపులై
సురమునియోగిదుర్లభము శుద్ధ మనంత మనంతధామమున్.

క. చనుచున్నవాఁడ నే నా
పనిబూనియ యిపుడ, సుంత వారక మీరల్
చనుదెం డిదె దరిసెం దటి
చన మీయఘము లనుచు మునిశర్మ కడంకన్.

వ. అవ్వారి నేవురం దనవెంటం గొని నానావిధక్రూరజంతు సంతాన నిరంతరసంచారభరితంబును, దుర్దాంతంబును, దురంతంబును, దుర్గమమ్మును నవు నొకభయంకరకాంతా రాంతరమ్ముననుండి చనుచు నొకయెడ,

గీ. నగుచు నెకసక్కెమాడుచు నర్తనమ్ము
సేయు చఱచుచు నెమ్ములు చేతఁబూని
ప్రాణములు వోవఁ జఱచెడువారిపగిది
నెదురుగా వచ్చు ప్రేతల నెనిమిదిగుర

గీ. కదుర నెఱ పెంతయే మదిఁ గాంచి మోడ్చి
చేయిదోయి 'నమోస్తు నారాయణాయ
రక్ష రక్ష మా' మనుచు కరము స్వరమ్ము
నున్నతమ్ముగ ననియె నయ్యురుగుణుండు.

తే. ఆలకించినమాత్ర నారాయణాఖ్య
గరుడమంత్రసంస్మృతిఁ జేసి గాలిమేత
రులరక మ్యొప్ప వ్రాలిచి తలలు మ్రోల
వినయమున నున్నఁ గన్గొని ప్రేతములకు,

క. అనియె మునిశర్మ యిమ్మెయి
వినిపింపుఁడు మీ రెవారో పెరసిరి దోసఁగుల్
పొనరిచి యెట్టివ యిట్టివి
తనువుల్ వనటు లన నని రతని కాప్రేతల్.

గీ. పుణ్యదర్శన! యొడలెల్ల బూతిసేయ
క్షుత్పిపాసల పేరిచిచ్చులు, కెలంకు
లెఱుఁగ కిచ్చమైఁ దిరుగుచు నెల్లవారిఁ
బొలియ నడఁచెడు కలుషవృత్తులము మేము.

తే. ప్రొద్దుపొడుపునఁ జీఁకటుల్ పొడవడంగి
కెలఁకు లట్టులు మీపదజలజదర్శ
నమున రూపఱె పాపముల్ నలువుమీఱ
నేర్చితిమి నిర్మలత మహానియతికతన.

క. తివిరి భవదాస్యనిర్గత
మవునారాయణరవమ్ము నాలించినమా
త్ర విరాజితె మాహృదయము
దివాకరునుదయమును గని దినముఖమట్టుల్.

క. అనఘమతివి భాగవతా
గ్రణి పీడ్యుండవు త్రికాలగతివేత్తవు పా
వనము భవద్దర్శన మెన
సినమా కున్నె యిఁకఁ బ్రేతచేష్ట మహాత్మా!

వ. పర్యుషిత, సూచక, శీఘ్రగ, రోధక, లేఖక, వాగ్దుష్ట, విద్దైవత, యాచనలకు లను నామంబుల నవాప్తపిశాచత్వంబున నలుగెలంకులం గలయఁదిరుగుచు మును పొనరించిన దోసఁ గిసుమంతయు శమింపక వచింప నలవియ కానిమనస్తాపమ్మునఁ గుందుమమ్ము దయవార సుదుస్తార మీఘోరవిపదకూపారమ్మునమండి యుద్ధరింపు మని వేఁడిన విని మునిశర్మ యిట్లనియె—

ఆ. సలిపి దుష్కృతులు పిశాచరూపును గన్న
వారి కెనయఁబోవు పేరు లెందు
నట్టియెడలఁ జోద్యమయ్యె సనాముల
యాట మీర లన్న నాసుకృతికి

వ. పర్యుషితుం డిట్లనియె,

గీ. ఇష్టమృష్టాన్నముం దిని యే నిజోద
రంభరణపరాయణత దుర్గంధబంధు
రమ్ము పర్యుషిత మ్మోగిరమ్ము నొడ్ల
కిడితి నద్దానఁ బర్యుషితుఁడన యయితి.

గీ. వృత్తిగాఁ దన కది యొడ్డు వెతకి వెతకి
పరులమర్మమ్ము, లవియెల్లఁ బలువగమికిఁ
బ్రొద్దుపోకకు సూచించుమూర్ఖుఁ డితఁడు
సూచకాభిఖ్యఁ దనరె సంశుద్ధచరిత!

గీ. వేదవేత్తయె యవుఁగాక విప్రవరుఁడు
క్షుభితుఁడై తను గోరవచ్చునెడ నురగ
దష్టుఁడట్టులు వడిఁ గూలుదుష్టుఁ డవ్వట
నితఁడు శీఘ్రుగుఁ డనుపేర నెసఁగె ననఘ!

గీ. ఒడ్ల కోకయింత యిడక తా నాక్రమించె
యంగద యనంగ శేకెత్తునింగలమునఁ
బొలియుచున్నవారలఁ గని కులుకుచుఁ దిను
ననద యాతఁడు రోధకాహ్వయము నొందె.

గీ. కారణము లేక యూరక కాలివ్రేల
నేల రాయుచునుండు నెవ్వేళఁ బలుకఁ
డొకటియును మూగి యటు మౌన మూనియుండు
నార్తదైన్యుఁడు లేఖకాఖ్యనుఁ డితఁడు.

గీ. అనును గానిది యౌనంచు, నైనదానిఁ
గా దటంచును నెదిరించు; ఖలుని సాధు
వరునిగా, సాధువును వట్టిపలువగాఁగ
నెంచు; నటులాట వాగ్దుష్టుఁ డితఁ డయ్యె.

గీ. ప్రబలి నాస్తికభావము వాదులాడు
లేఁడు దేవుఁ డనుచు వీఁడ వీడి పితృది
నమ్ములన్ మాన్పు నవ్వారి నమ్మఁబోక;
పండితుండ నే నను విప్రైవతుఁ డితండు.

గీ. కల్లబొల్లిప్రలాపమ్ము లల్లి కొన్ని
మోసపుచ్చు జనమ్ముల, ముల్లె కొల్ల
గా గడించుఁ బాపముభీతిఁ గాంచఁబోఁడు
యాచనకుఁ డెన్న నీతఁడు నట్టివాఁడ.

గీ. ఫలముగా నిట్టిదుర్భరకలుషములకుఁ
గుడిచి ప్రేతనాథునివీట నిడుమ లెన్నొ
సమలు వేలకొలందిగ జనన మెనసి
తిమి పిశాచత నిపు డుపశమితపాప !

క. అమలాత్మ ! పురీషశ్లే
ష్మమూత్రవనితాజనాంగమలపూర్ణత శౌ
చమురూ పెఱుఁగని యుదవసి
తము లోరెము మేము కుడుచుతావులు సూవే.

క. రమణీనిర్జితములు, శమ
దమక్షమాపేతములు, వదాన్యగుణాత్య
క్తము, లాచారపరిభ్ర
ష్టములును, స్త్రీజనముచేత సందగ్ధంబుల్.

గీ. తగవు, లేఁపులు, బొబ్బలు, మగని మొగముఁ
జూడ మండెడి కులటలతోడ నింటి
మాధవారాధనము లేక మలినభక్తి
నొప్పునట్టులు మాబోంట్ల కునికిపట్లు.

గీ. అట్లు మాకాశ్రయ మ్మిడునట్టి భ్రష్ట
మతులు జనియించువారు మామాద్రి ప్రేత
పతుల యయి తుది విదితప్రభావ! కలుగ
వలదు మాపాపఫల మింత పగతు కేని.

గీ. పరమకరుణారసమ్ము జాల్వార ఘోర
మస్మదుల్బణకిల్బిషమున్న దిప్పుఁ
జెచ్చెర శమింపఁగాఁ జేసి స్థిరయశమ్ము
గొను మటంచు వేఁడిన, నను ఘనుఁడు దలంచె.

క. దేవాతిథిపూజాగురు
సేవాదుల శ్రీశపాదచింతనపరతన్
రేవాదికతీర్థాభిని
షేవణమునఁ బ్రేతరూపు చెనక దెన్నాఁడున్.

గీ. నిత్యసత్యవ్రతనిరూఢి నెఱయ విహిత
ధర్మవర్త్మమునఁ జరించు ధన్యమతుల
కులములందునఁ బ్రేతతఁ గొనఁ డెవ్వాఁడుఁ
బదితరమ్ముల దనుక నిర్వంకలందు.

చ. ఎనసినభక్తి గోవుల, మహీసురవర్యులఁ, బర్వతమ్ములన్,
ధునులఁ, బవిత్రతీర్థములఁ, దోయధులన్, రస, రావిచెట్లఁ,
దోఁప నతివినీతవృత్తు లభివందన మాచరియించు నెవ్వఁ,
డాఘనునికులమ్మువా రెపుడుఁ గాంచరు కశ్మల మిట్టి
రూపునన్.

తే. త్రిపథగాముఖ్యముల్ పుణ్యతీర్థములలో
లలిఁ దదర్చనముం బ్రీతి గొలుపఁ జలుపు
వానిపున్నెమ్ము పేర్కొన వశమె? వాని
దర్శనము మాత్రమునన ప్రేతత్వ మడఁగు.

వ. అది యటులుండె,

గీ. ఉర్వి నూర్జస్థలమ్ము దామోదరేష్ట
తమము నూర్జముకన్న మాధవధవమ్ము
తపముమాసముకన్న నుత్తమతమ మ్మ
సమము మధురిపుప్రియము వైశాఖ మంద్రు.

వ. అట్లుగావున,

తే. సకలఫలదమ్ము మాధవునకుఁ బ్రియమ్ము
నైనమాధమాసమ్మునమలమహిమ
మహిత మాదరమున వినుమాత్రఁ బ్రేత
రూపు రూపఱుఁ బ్రాపింప నోపు ముక్తి.

తే. వేదవిద్దర్శనమున గోవిందనామ
మును స్మరించినఁ దా విన్నఁ బుణ్యతీర్థ
ములఁ బొనర్చిన స్నానమ్ము బొలుచునిట్టిఁ
బూరుషుఁడు పాపపంకనిర్ముక్తుఁ డగును.

క. తొలిరాశి నున్నయప్పుడు
జలజాప్తుఁడు కైరవాప్తజాజలములలో
సలుప నవగాహ మొదవెడు
ఫలిత మనంతమ్ము సర్వపాపహరమ్మౌ.

క. కావున నుద్వృత్తుల నీ
యేవురఁ గొని రేవరేవు నెలమిం జేరన్
బోవుచునుంటి నచోటం
గావింతు భవద్విముక్తికరములు వరవుల్.

వ. మీ రియ్యెడన యభీక్ష్ణులై యుండుఁడు, మీకన్యలం బవిత్ర
కల్పంబ యని వారల వీడ్కొని గాలింటిపురుషుఁ డొకండమ్ము
వెంటనంటి రా వడివడినడల సుకృతగేహమ్ము శివదేహ
మ్మున కరిగి యందు విధివిధానమ్మున స్నాన మొనర్చుచు
దర్భనిర్మితులవు సప్తతలసయితమ్ము సరోమకారాయ
త్తమ్ము చిత్తమ్మున మునింగించినయంత సహాయుడను
ఘోరమ్ము పురాకృతదుష్కృతమ్ము రూపఱి తానున్న
వనమ్ముననుండియ యపవర్గము నెనసి రయ్యేవురును

దత్తాన్నసమాత్రమ్మునన తక్కంగల ప్రైత్థికనికరంబులుకనుం గొనుచుండ స్వర్ణవర్ణశరీరులును బీతాంబరధారులును హారకటకకేయూరాద్యలంకృతులు నయి పరమపదంబున కరిగి రట్టిపట్టున,

తే. "తమయెడంద ముకుందసుందరపదార
విందయుగళిఁ దలఁచుచు నమందభక్తి
మాధవమ్ము మాసమున నర్మద మునింగి
కాంచి రీయేవురు నపవర్గమ్ము సుఖము.

గీ. ప్రేతముక్తిదమైన యివ్విమలతీర్థ
రాజమున భక్తి నీ నెలఁ బ్రత్యుషస్సు
గ్రుంకులిడుకన్నఁ గలదొకొ ఘోరదురిత
నికరమునకుఁ బ్రతీకార మొకఁడు వేఱె."

క. అని ప్రస్ఫుటముగ వినవ
చ్చినయాకసమునుడువులకుఁ జెనయుచు నబ్ర
మ్మును ప్రైత్థికు లెల్లఁ గడు
మునిశర్మన్ ధునిని మాసమును బొగడి రొగిన్.

క. కావున భూవర! యేవా
రీవైశాఖమ్మునందు నెంతయుభక్తిన్
రేవాసుస్నాతుల యయి
యావలఁ బాపప్రశమన మను స్తోత్రమ్మున్.

గీ. పఠనపాఠనశ్రవణతత్పరతఁ బరఁగు
వారు, వారలు దురిత మేఘక్షి- నదేహ
నదియ యైన దూర మొనర్చి యవ్యయమ్మొ
పదము గాంతురు వైష్ణవప్రవరు లవుచు.

వ. ఆస్తోత్ర మెయ్యది యంటేని,

క. ఘను నినబింబాంతర్వా
సి నిగమగోచరు ననంతుఁ జిన్మయు లోకే
శు ననాది నాద్యపూరుషు
ననుకంపాపూర్ణు విష్ణు నాత్మఁ దలంతున్.

క. స్థావరజంగమరూప
మ్మావిశ్వము పొడము నెగడు సడఁగు యదీయ
మ్మౌవాంఛ నెవానికి స్వా
భావికము క్రియాదిక మ్మవాని భజింతున్.

క. తలఁచిన మాత్రన యేవిభు
సలలితములు మృదుపదాంబుజాతము లఘముల్
తొలఁగి పుమర్థంబులు విల
సిలు కరగతము లయి వాని శ్రీశుఁ దెలంతున్.

క. వారక మోహాహార్మిసుదు
స్తారభవాంభోధిమగ్నతారక మేలో

కారాధ్యపదస్మృతి యా
శ్రీరమణీరమణు భక్తిఁ జింతింతు మదిన్.

క. సర్వేశ సర్వకారణ
సర్వాంతర్వాస సర్వజగదాధారా
సర్వమయ సర్వభావన
శర్వాదిసుపర్వవినుత సాకవె నన్నున్.

గీ. భవముపేరిటి మఱలఱంపమ్ముచే వి
దారితమ్మయి నీమాయపేరిపెనుపి
సాసి నిర్దయ మర్దింపఁ జాల నొచ్చి
యున్నలోకము నేలు ప్రపన్నపాల!

గీ. బ్రాహ్మణప్రియ బ్రహ్మగమ్య
విపులవైభవ భవహర వేదపురుష
తాపతతితూలవాతూల! పాపు మయ్య
వాఙ్మనఃకాయకృతములు పాపములను.

గీ. హరి హృషీకేశ కేశవ పుండరీక
నయన యను పుణ్యతమములు నామము లివి
యూఁ డెవాఁడు నిరంతరమును జపించు
నతని కిడుదు కైవల్యమ యనఘ! నీవు.

క. ఈయఘశమనస్తోత్రముఁ
బాయక యెవ్వారుఁ భక్తిఁ బఠియింతురు సు

శ్రేయోయుతులై కమలా
నాయకుననుకంపఁ గాంత్రు నరపాలమణీ!

క. తెలిపితి మాధవమాసము
కలమహిమము నీకు మున్ను కంజజువలనన్
దెలిసినపోలుపునఁ, దద్విధిఁ
జలిపి సమాదృతిఁ బడయుము సౌఖ్య మ్మెంతేన్.

గీ. చనుచునున్న దీపుణ్యమాసమ్ము సైత
మింక రేవాజలమ్ములఁ గ్రుంకి యింకి
పోవఁ గలుషకర్దమ మెల్లఁ బారయవలయు
జనికి సార్థక్య మబ్జలోచనునికరుణ.

వ. ఇదె పోయివత్తు నని ప్రయాణోన్ముఖుం డయిన భాగవత ధర్మసూక్ష్మవినిర్ణయవిశారదు నారదు వారించి యంచితా దృతిఁ గరకమలమ్ములు ముకుళించి నుతించుచు సంబరీషుం డిట్లనియె—

తే. మహిత! మాధవమాసముమహిమ యెల్ల
వింటి, శ్రుతిలాభఫల మందఁగంటి, నుంటిఁ
గలుషనికరమ్ము దూరమ్ము సలుప భవద
పారకరుణావిశేషమ్ము కారణముగ.

తే. ఇంక నమ్మాసమున నాచరింప నొప్పు
విధివిధానమ్ము జపతపోవిధులుఁ గోశ

నార్చనప్రకారమ్ము, స్నానాదికముల
తీరు, ఫలితము, సర్వముఁ, దెలియఁజేసి,

వ. నన్ననుగ్రహింపు మని ప్రార్థించిన నప్పార్థివోత్తమున
కమరముని యిట్లనియె —

ఆ. ప్రముద మొదవె మది భవత్కృతప్రశ్నమ్ము
వలన నిట్టికతలు తెలియఁ గోరు
వాఁడు, తెలుపువాఁడుఁ గూడ రొక్కెడ నెప్డు;
సంఘటిల్లె నిట్టిచాయ మనకు.

వ. ఇయ్యుదియ నా కవశ్యమాచరణీయమ్ము రేవాస్నానమ్మువు
నింక,

### వైశాఖస్నానవిధి

చ. వినుము రమాధినాథునకుఁ బ్రీతికరమ్మయి మాధవాఖ్యమై
తనరుద్వితీయమాసమునఁ దామరసాప్తుఁడు పొల్చున ప్రజా
యనమున మానవుండు ధునినైన సరస్సునఁ దీర్థమందు నే
ననువప్రపుష్కరాకరమునం దవగాహ మొనర్పఁగాఁదగున్

తే. వదలి భుక్తి యమ్మాసము పదునొకండు,
పదునయిదవపుదినమ్ములఁ బావనమ్ము
తీర్థమునఁ గ్రుంకి పొసఁగుప దేవదేవు
నర్చ సర్వమాసఫలాప్తి నలరు నరుఁడు.

తే. సనియమముగ వైశాఖమాసమ్ము స్నాన
మాచరించెద నంతరాయములు బాపఁగ
నీక సాఁకఁగదయ్య నాగశయన !
యని హరి స్మరించుచు మునుఁగఁజనును ఘనుని.

గీ. తొలుతఁ గొని కేల దర్భ లాజలము నాత్మ
యమ్ము 'నోం నమో నారాయణాయ' యన్న
మూలమనుసంస్మృతిం దీర్థమును బొనర్చి
విధివదాచాంతుఁడై ప్రమోక్షి విమలవృత్తి,

వ. చతుర్హస్తపరిమితమ్మయి చతురస్రమ్మగు జలప్రదేశమ్ము
నన విహితమంత్రమ్ము బఠించుచు గంగావాహనమొన
రించి,

గీ. పృథ్వి, శాంతిదాయిని, శాంతి, విశ్వనాథ,
నలిని, విద్యాధరీ, దేవి, నందినీ, వి
హగ, శివప్రియ, శివద, జాహ్నవి! బిరానఁ
బూనుమా వెన రని జహ్నుపుత్త్రిఁ దలఁచి,

క. కొని యశ్వక్రాంతే యను
మనువున మృత్తికఁ దనశిరమున జలసమ్మా
ర్జన మొనరించికొను చఘనా
శన మవగాహమ్ము నరుఁడు సలుపఁగవలయున్.

గీ. అవలఁ బ్రమతుఁడై యాత్మభూహరిశివప్ర
జాపతిసుపర్వయక్షరక్షఃపిశాచ
ఖచరభూచరులకు నిలఁ గల సమస్త
జీవుల కిడ నొఁ దర్పణజీవనములు.

వ. పదంపడి బ్రహ్మపుత్త్రులకును సనకసనందనసనాతనకపిలాసురిప్రభృతులకును, మరీచ్యత్ర్యంగిరఃపులహక్రతుప్రచేతసవసిష్ఠభృగునారదప్రభృతిదేవబ్రహ్మర్షులకును, అగ్నిష్వాత్తసౌమ్యహవిష్మదుష్మపకన్యాసులబర్హిషదాజ్యపులు పితరులకును, యమవృకోదరాసులకును, స్వకులప్రసూతమృతపితృవర్గమ్మునకును, నవ్వారిప్రీతిం గోరి తర్పణమ్ములొసంగవలయుఁ బిదప,

గీ. కంజ మొక్కఁడు లిఖయించి కర్మసాక్షిఁ
బ్రజపితలోకకల్మషు ద్మానశాత్ము
నర్ఘ్యపాద్యాదివిధుల నత్యంతభక్తిఁ
గొలిచి నెలవున కరుగఁగావలయు నచట

గీ. స్వసుతమిత్రబాంధవజనసహితుఁ డవుచు
వలయు నాచరింప రమాధవవ్రతమ్ము
తరణి మేషరాశిస్థితిఁ దనరుతఱి ని
దియ యొసఁగఁజాలు ఫల మద్వితీయ మధిప!

గీ. స్నానసంధ్యాజపమ్ములు, సత్యవాక్య
పరత, బ్రహ్మచర్యవ్రతనిరతి, సక్త
భుక్తి, యొరుల యాచింపమి, పుడమిఁ బండ్క,
తద్వ్రతస్థులనియమముల్ ధరణినాథ!

గీ. అట్టులా వ్రత మొనరుచునట్టి ఘనుని
వేఱ పొగడఁగానేల యవ్విపులయశుని
గాథ వచియించుసంచితుఁ గాంచినంతఁ
బాపముల్ ఘోరతరముల రూపుమాయు.

గీ. సంజవేళలు మూఁడిటఁ గంజపత్ర
నేత్రు నర్చించి యమ్మేయిఁ బాత్రులైన
భూనిలింపుల కీయనౌ ధేనుకనక
ముఖ్యదానమ్ము లీప్సితపూర్తికొఱకు.

గీ. విను మనంతు ననంతపూజనవిధాన
మును వచించెద సంక్షిప్తముగ, నది నెఱి
మెఱయు వైదికతాంత్రికమిశ్రభేద
ములఁ ద్రివిధమయి. యందుఁ దొలిది, తుదిది,

గీ. ధరణిసురముఖవిహితముల్; తాంత్రికమ్ము
నియమితమ్ము వైష్ణవశూద్రనికరమునకు.
ద్విజవరానలజలరసాదిత్యులందు
నాచరింపనవుఁ దదర్చ హరిమనీష.

వ. తదర్చనపరుండు

క. ఒనరిచి స్నాన మ్మఘమ
ర్షణముం బూర్వోక్తరీతి సంధ్యాదికముల్
దినకృత్యమ్ములు దీర్చిన
వెనుక ససంకల్ప మర్చ విధిఁ జలుపఁ దగున్.

వ. శిలాకల్పితయు దారువికారయు లోహాకృష్టయు లేప్యయు లేఖ్యయు సికతామయయు మనోమయయు మణినిర్మితయు నన ననంతప్రతిమ యెనిమిదితెఱంగుల నెసంగు.

క. పొలుచుఁ జలాచలభేద
మ్ముల హరిని బ్రతిష్ఠ సేయుభూమి ద్వివిధమై,
చల కుబ్వాసావాహన
ములు గల వచల కవి రెండు పొరయవుసూవే.

క. అనలు హవిస్సుం గైకొని,
దినకరు నభ్యర్హణమున, స్థిర సంబువులన్
దనరఁ బదాఱుపచారము
లనిమిషనికరార్చ్య శ్రీశు నర్చింపఁ దగున్.

క. పొరిఁ గూర్చొని దర్భకృతా
స్తరణమునన్ సరుఁడు ప్రాగుదగ్వర్తి యై,
సరవిఁ గరాంగన్యాసా
చరణపరుండై మొదలిడఁజను విభునర్చన్.

వ. పాద్యార్ఘ్యాచమనీయమ్ములకనువవు పాత్రత్రితయమ్ముఁ గూర్పవలయు. నవల,

గీ. సంభృతమ్మవు ప్రతిమఁ గేశవు రమాస
నాథు నవ్వానియరిగదానలినశంఖ
ముసలకౌస్తుభశ్రీవత్సముఖ్యములను
లలిని నావాహనముసేయవలయుఁ జుమ్ము.

గీ. చందనోశీరకర్పూరసారసురభి
శీతాంబువుల సామకనకఘర్మానువాక
పురుషసూక్తమంత్రపఠనాభిరతి భక్త
వరదు సుస్నాతుఁ బొనరింపవలయు నంత,

గీ. కనకవసనోపవీతకంకణవరాంగు
శీయకాంగదహారావళిని నలంక
రించి పాద్య మాచమనీయ మంచితకుసు
మమ్ము లర్పింపవలయు నమ్మధురిపునకు.

గీ. పాయసాపూపమోదకభవ్యశష్కు
లీదధిక్షీరసర్పిఃప్రక్లృప్తమైన
దివ్యనైవేద్య మాదేవదేవునకు స
మర్పణముసేయవలయు నత్యంతభక్తి.

వ. పిదప విధివిహితమ్మవు కుండమ్మున ననలుఁ బ్రతిష్ఠించి విధివిధానమ్మున నిధ్మాదులం గొని హరి ప్రీతికరమ్ముగ

హోమ మ్మొనరించి పీఠావాసితులవు తత్పార్షదులకు బలు లిడవలయుఁ దదనంతరంబ సమాహితమతి నననన్య చింత సత్కథాశ్రవణపరత్వమునం దనరి నృత్యగానపురాణాదులఁ బరాత్పరుఁ బ్రీతుం జేయవలయు. మఱియు,

సీ. ప్రాఁబల్కువీదిలోఁ బర్వులెత్తెడువాని,
యోగిహృత్కుహరాల డాగువానిఁ,
దపసిడెందపుటింద్లఁ దనర నిల్చెడువానిఁ,
బదముపట్టినవారిపాలివానిఁ,
గ్రొమ్మానికమ్ములకులుకుసొమ్ములవానిఁ,
బసిఁడిమెఱుంగుదువ్వలువవానిఁ,
గూర్మిపేరిటిసుధఁ గుఱియుకన్నులవాని,
రమ కిరవైనయురమ్మువాని,
నిఖిలలోకములలో నిండియుండెడువాని,
నెఱుకకలుగువారి నెఱుఁగవచ్చు
వాని, నాదిబీజ మైనరమాజాని
భక్తిమై స్తుతింపవలయు భూప!

గీ. తా నొనర్చి ప్రదక్షిణత్రయము తుది వ
చింపఁజనుఁ దదుద్వాసన మిట్టు లనుస
మమ్ము వైశాఖమునఁ జేయుమనుజుఁ డొందుఁ
దిరిగిరాక యె లేనియప్పరమపదము.

గీ. సర్వకారణకారణు సర్వభూత
హితనిరంతరు నిందిరాపతిని నిట్టులు
భక్తిభావమ్మునం గొల్చువాఁడెపో ధ
రాతలమున ధన్యుండు నా ప్రఖ్యాతిఁ గాంచు.

వ. వేయేల నోయిలాధవా,

మ. హరిపాదప్రణిపాతధూళిధవలమ్మౌ నొసలె నొసలమ్ము, శ్రీ
కరరమ్యాపఘనేక్షణాప్రవణమౌ నేత్రమ్ము నేత్రమ్ము భూ
సురముల్ మాధవులీలలాలి వినని శ్రోత్రంబు శ్రోత్రంబు, ని
ర్జరసందోహసముచ్చయార్చనను నా జిహ్వమ్ము జిహ్వమ్ము సూ.

గీ. చేయఁగానొప్పు నిద్ధాని స్త్రీలు శూద్ర
జనములును మూలమంత్రమ్మునను; గుణియించు
నుడువునట్టు లితరవైష్ణవుఁడు. శుభమ్ము
పెరయు మీ యీదృశవ్రతాచరణపరత.

వ. అని నుడివిన

క. విని యబ్బురంపడుచు ని
ట్లను సమ్మనుజేంద్రచంద్రుఁ డఖిలజ్ఞా! పా
వన మిమ్మాసమహాత్త్వ
మ్మును వినఁ గల్గితిని నీదుపొలుచునయమోయిక.

ఉ. సంతతమాధవస్మరణసక్తమనస్కుఁడవైన, దిగంతవి
శ్రాంతినితాంతకీర్తినయి, సాధుజనప్రియవృత్తివైన, ధరా

కాంతకులాబ్ధిరత్నమయి, క్ష్మావలయమ్మఖిలమ్ము నేలు చే
సంతసమొందుచుంటి నిటు చాలినయుంతి వరాలదాంతితో౯

తే. ఎన్న నేతెన్నునం బొల్చుపున్నెముం బొ
నర్చిము న్ననసితి నీయనశ్వరమ్ము
విభవముం, గూర్చు నెచ్చెలి, వే వచింపు
మయ్య, కనము నీయెఱుఁగనియంశ మొకఁడు.

అంబరీషుని పూర్వవృత్తాంతము

క. అనఁ బ్రేమరసాంచితలో
చనవనజద్వయుఁడు జలజజనిసూనుం డి
ట్లను భూవర ! యడిగితి నీ
కనువవు ప్రశ్నము వచింతు నాలింపు మొగి౯.

వ. మున్ను త్రేతాయుగమ్మున

చ. నలువు చెలంగు రూపవతినాఁ దగు పేరిటి రూపజీవినీ
తిలక మొకర్తు వాడిమొన తేలినపూవులవింటివాని క్రొ
మ్ములికి సురూప నాపెఁ గని ముగ్ధులమై యఱమూత
కంట నాల్కలు కొఱుకంగఁబోవక నిలంగలజాణలఁ గాన
మేయెడ౯.

తే. పుట్టుపడుపు పెదలి యయ్యుఁ బోక కులము
వర్తనముజాడ విప్రదైవతము లెడల

మిపుల భక్తివిశ్వాసముల్ మెలఁగుచుండెఁ
బున్నెపుంబని సేఁతల బుద్ధి నిలిపి.

వ. ఒకనాఁ డయ్యూరం గల దేవాలయంబునను

గీ. పూని మాధవమాసమ్ము స్నానఫలము
నాలకించి రహించినయాదృతి నటు
లనుదిన మ్మొనర్పఁ గడంగెఁ దనసుబోధఁగు
దేవదాసాఖ్యుఁ డగసాలితో వరేణ్య !

గీ. నిర్మలము భక్తిభావమ్ము నెఱయ నొసఁగె
రూపజీవిని యాపె పాత్రులు మహీసు
రాగ్రణులకు గోధనకనకాంబరాది
కములు మాధవప్రీతికరములు గాఁగ.

వ. ఒక్కసమయమ్మునను నక్షయఫలప్రదమ్మును నగు నక్ష
తృతీయాదినమ్మాగమ మ్మెఱింగి యమ్మెఱుంగుబోఁడి దేవ
దాసున కిట్లనియె—

ఆ. ఆదర మ్మొప్ప నపరంజిచే హరి
విగ్రహ మ్మొకండు వేగఁ జేసి
యిమ్మ విధివిధాన మెసఁగఁ బూజించి స
త్పాత్రుఁడైన విప్రవరున కద్ది

తే. తివిరి దుర్లభమక్షతృతీయనాఁట
ప్రొద్దుపొడుపున నొసఁగుదు; రూపటించు

భవము వైశాఖమాసమ్ము ప్రథమపక్షు
మునఁ దృతీయనాఁ డీదృశ మనిరి బుధులు.

మ. అనినన్ నెచ్చెలి దేవదాసుఁడు ప్రమోదాయత్తచిత్త
మ్మునన్ గొనబౌ మేలిపసిండి శ్రీసహితునిం గోవిందు
నిర్మించి యిచ్చిన నయ్యింతి సదక్షిణాకముగఁ జేసెన్
దానమున్ బ్రహ్మవిజ్ఞమాన్యుంపు మహీసురోత్తమున
కజ్జాతాక్షుఁ జింతించుచున్.

ఆ. సమలు కొన్ని యేఁటులు సనినయావల వార
లిరువు రసువు దొఱఁగి యెనసిరి తరు
వాతిజన్మ విని తె వైశాఖమహిమమ్ము
నీవు నీదుకూర్చు నెలఁత గాఁగ.

వ. కావున

క. వెనుకటిపుట్టువునం జే
సినచేఁతలవాసన లతిచిత్రమ్ముల మై
తనరు, నవాని నెఱిం గెడు
ఘను లేలోకమునఁ గలరు ఘనానాథాగ్ర్యా?

గీ. సాధుసంగతిశూన్యు లసంయతాత్మ
లాశ్రమాచారదూరు లనాద్యవిద్య
పేరిదయ్యముపాలైనవారు లేరు
మాధవాఖ్యానమాసధర్మమ్ము లొంప.

గీ. వరద గోవింద మాధవ వాసుదేవ
కేశవ ముకుంద మధువైరి కృష్ణ విష్ణు
యనుచు నోట నెఱుంగని యలంతు లొందఁ
గలరె వైశాఖమాసముం గొలుచునియమి?

చ. తతభవభీహరమ్ములు సుధామధురమ్ములు తాపతమాలమా
రుతములు మోహతామసవిరోచనరోచులు శ్రోత్రభూషల
చ్యుతచరితమ్ములన్ వినఁగ నోఁపని పాపుల కెట్లు గల్గు ని
స్తృతము ద్వితీయమాసపరిసేవనదీక్ష భవమ్ముఁ బాయుటల్.

గీ. అనుచు వచియించి నిర్జరముని చనియె నె
సకఁగఁ ద్రిపథగాస్నానకౌతుకము; విధివి
ధానమున మాధవస్నానదానముల నో
నర్చె నంబరీషుఁడు రమానాథుఁ బ్రీతు.

ఆ శ్వా సాం త ము

క. స్థావరజంగమరూప
మ్మీవిశ్వము విశ్వమెల్ల నేవెలితియు లే
కేవేళం బ్రోఁచెడు ల
క్ష్మీవల్లభుఁ డేలు మాసుకృతిపతిని గృపన్.

భుజంగప్రయాతగర్భస్రగ్విణి—

పద్మపత్త్రేక్షణా, పావనాంఘ్రీ, రమా
సద్మవక్షో విరాజత్సుహారో త్తమా,
పద్మమిత్త్రాయుతభ్రాజమానా, నమ
త్సద్మవాసా, కనచ్చక్రధారీ! నమః.

ఇది శ్రీశ్రీవత్ససగోత్రపవిత్ర, చిదంబరపౌత్ర నాగ
భూషణసుధీవరపుత్త్ర శ్రీ బాలాత్రిపురసుందరీగర్భ
శుక్తిముక్తాఫలాయమాన ప్రభాకర, లక్ష్మీ
నరసింహశాస్త్రిసమాఖ్యానప్రణీతంబైన కాల
భాగవతముద్వితీయస్కంధమున ద్వితీ
యాశ్వాసము సంపూర్ణము.



*                    *                    *

మ. క్రమమై మూడగునూరికిన్ ద్విగుణమౌ గవ్యూతిమాత్రమ్ము
దూరమునన్ దొల్లిట నున్నయప్డు మిము నేత్రమ్మారఁగా
ఘస్రఘస్రముఁ గన్గొంట నెసంగి పొంగిసప్రహర్షమ్ముఁ
బొసంగించుఁగాత మనస్సన్నిధిఁ గూర్చునై మనసుఁ బాత్తై
మిమ్మద్ది ముప్పొద్దులన్.

*                    *                    *

శ్రీరామ

## కాలభాగవతము—ద్వితీయస్కంధము

# వైశాఖమాహాత్మ్యము

## తృతీయాశ్వాసము

శ్రీమానినీశమృదుపద
తామరసద్వంద్వసంతతధ్యానవిధో
ద్దామా అభిరామగుణ
స్తోమా శ్రీవేంకటేశ సుజనలలామా!

వ. విను మివ్విధమ్మున

క. నెనరుసఁ దెలిపిన యఘుమో
చన మజతనుజాంబరీషసంవాదమ్ముఁ
విని యనఘులు శౌనకముఖ
మునిచంద్రము లనిరి సూతమునివరున కిటుల్ —

తే. వరమునిస్తోత్రపాత్ర! భవన్ముఖాబ్జ
నిర్గతపురాణసారమ్ము నిర్మలమ్ము
శ్రోత్రపాత్రమ్ములం గ్రోలి స్రుంత తనివి
సనవు రసపిపాసువులు మామనసులెల్ల.

క. ఘనవైశాఖమహాత్త్వ
మ్ము నింక వినిపింపుమయ్య భూరికృపావా
రినిధివ యయి ము న్నెన్నఁడు
విని యెఱుఁగము నిక్క మిట్టివిమలములు కథల్.

వ. అని వినయమ్మునం బ్రార్థించినఁ బ్రహర్ష భరాలసమానసుం డయి రోమహర్షణ సూనుండు శౌనకాదిమునీంద్రుల కిట్లనియె —

అ నం తా నం త సం వా ద ము

మ. తను నిల్పం దగి యాదిసర్గమున నాధారమ్ము లే కింతయే
వనధిం గ్రుంగువసుంధరం గిటిపరూప మ్మొంది నిస్సంఖ్య
యోజనవిస్తారము వామదంష్ట్రి బహువర్షమ్ముల్ నిలంబెట్టె
జీవనజాతాత్ముఁడు; నాఁడు పృథ్వి నతయై ప్రశ్నించె ని
ట్లవ్విభుః.

మ. పదియుః రెం డయి మాసముల్ ప్రతిసమః భాసిల్లి
మున్మాఘుసర్వాదియానాళ్ళఁ దలిర్చు; నందును బవి

త్రమ్ముల్ కదుర్, వాంఛితప్రదముల్ కొన్ని తపోము
ఖమ్ముల్; లట్టులే రాజిల్లు నేఘ్రముల్ ముదముం
గూర్పఁగ నేర్చి చెచ్చెరఁ గృపాంభోరాశికిన్ శౌరికిన్?

క. లలి యుగముల యుగముదయ
మ్ముల యుగమంతములఁ గల్పముల నన్నింటిన్
గెలిచి మహోత్కృష్టఫల
మ్ముల నిమ్ములఁ గూర్చు ఘస్రములఁ దెలుపఁగదే.

వ. అన నయ్యాదివరాహమూర్తి యిట్లనియె—

గీ. విధి నెఱింగి యెఱుంగ కెవ్విధమున నవుఁ
గాక యజియింతు రేరు నిష్కలుషభక్తి
పరత వైశాఖమాసప్రవరమునందు
నన్నవార కూరుచువారు నాకు మిపుల.

గీ. అవని! మాధవమాసమ్మునందు మునుపు
పసిఁడికనులాఁడు, మధువునా బలియురు తొలి
పొలసుమేతరు లిరువురఁ బొలియనేసి
యుద్ధరించితిఁ బెనుకోఱ నూని నిన్ను.

గీ. జ్ఞానవర్ణవ్యవస్థితి, సకలనిగమ
ధర్మమార్గప్రవృత్తియుఁ దనరెఁ ద్రేత
పేరియుగమున నాకెంతొ ప్రీతిఁ గూర్చి
పేర్చు వైశాఖమందె బుధార్చితాంఘ్రి!

గీ. ప్రథిత మాయుగమ్ము ప్రారంభ మయ్యె వై
శాఖమాసము తొలిసగమునందు
మూఁడవదినమునను బొలుచు నక్షయతృతీయ
పేర నది యొసఁగుచు భూరిఫలము.

క. అమ్మాసమ్మున సమ్మో
దమ్మున నొనరించుస్నానదానవ్రతము
ఖ్యమ్ముల కే నొసఁగుదు ని
క్కమ్ముగఁ దుదలేనిఫలము కాశ్యప! వింటే.

క. ఈదృశవైశాఖస్నా
నాదరపరులైన పుణ్యు లడఁగి యఘమ్ముల్
పోదురు సస్వజనమ్ముగ
నాదివ్యపదమ్ము సేర నందితమతులై.

క. సమధువులు తిలల్, తగుఛ
త్రము, వీవన, కాలిజోడు, రమ్యమ్ములు వ
స్త్రములు, ఫలమ్ముల నొసఁగెడు
సుమతులపున్నెమ్ము లెన్న సురలకుఁ దరమే!

చ. మతి సెడి మాధవప్రియుఁడు మాధవమాసమునందు మా
ధవవ్రతము బొనర్పఁ బోక యితరవ్రతనిర్వహణత్వచిత్తుఁడౌ
నతఁడు కరంగతమ్మవు మహార్ఘము రత్నముఁ బారవైచి
వే వెతకెడువాఁడ పాడయినవీథిలో రాగిడిమంటిబెడ్డలకా.

వ. కావున ననంతా,

క. అమలము వైశాఖము మా
సము సూ సర్వోత్తమమ్ము సంసేవ్యము ని
త్యము, మత్ప్రీతికర మ్మని
కమలాపతి నుడివెఁ బుడమికలికికిఁ దొలుతన్.

వ. అది యటులుండె నేతన్మాసమాహాత్మ్యప్రకారవివరణ
మ్మయి యమబ్రాహ్మణసంవాదరూపమ్మునఁ దనరుపురా
తనచరిత మ్మొకఁడు వివరింతు నవహితమతి నాలింపుఁడు

యమబ్రాహ్మణసంవాదము

క. ఎసఁగుం గంగాశమన
స్వసలనడుమ మధ్యదేశసంఖ్యాతమ్మై
యొసకము విషయవర, మ్మం
దు సమస్తశ్రుతివిదులు సుదూరితదురితుల్,

క. శమదమసంపన్నులు భూ
సుమనసులనివాసకలన శోభనమై చె
న్నమరు మహాగ్రామము నా
నమలతర మ్మగ్రహార మమరపురియటుల్.

వ. ఒకదినమున శమనుండు

గీ. ఉఱిమిన న్నిప్పు లుఱలించు నెఱుపుకనులు,
కనిన గుండియ లగలింపఁగలుగుకోఱ

జంట, మునుమున్న తనకన్నఁ జనెడునట్టి,
ముక్కు గల యూర్ధ్వరోమముని నొకని భటుని

వ. చేరంజీరి

గీ. కదుర నరిగి రయము మహాగ్రామమునను
ఘను వసిష్ఠగోత్రభవు నాగమశిరోగ్ర
విదుని యజ్ఞదత్తాహ్వయు విప్రవరుని
దెమ్ము మనపురి; కమ్మాన్య సమ్మదమున

గీ. కొలిచి పాద్యాదికమ్ముల నెలయవలయు
నేను ఫలము పుట్టువునకుఁ; గాని తనను
వాద మనఁ జనుపొరుగింటివానిఁ దుల్య
శీలనాముని గొనిరాఁగఁ బోలదు సుమ.

వ. పొమ్ము పదిలమ్ముగ నిప్పని సాధించికొని రమ్ము గదమ్మ
యని ముదల యిడి యనిపిన వాఁడును వత్తె యని మహా
గ్రామమ్మునకుం జని యజ్ఞేశ్వరకల్పుల యజ్ఞదత్తుల నిరు
పురం గని తనయేలిక తెలిపినవానిం గుఱుతించి నేఱిమి
ద్వితీయుం గొనివచ్చినఁ జెచ్చెర నచ్చతురాస్యసుతోత్తం
సుం గనుంగొని ధర్ముండు

క. ఎదురేఁగి, యొసఁగి యనువగు
నది పీఠము, భక్తియుక్తి నర్చించి శుభా

స్పదములు తత్పదములు పలి
కెం దనభటుల కిట్లు, లీసుకీర్తిసమేతుఁడా,

క. క్రమ్మఱఁ గొనిపొంపు పవి
త్రమ్ము మహాగ్రామమునకుఁ దడయక యవ్వా
క్యమ్మునగమ్మున నిట్లను
నమ్మనుజకులావతంస మాధర్మనితోఁడా.

గీ. దేవ! ననుఁ గొనిరానేల, తృటి గడచెనో
లేదో, మఱలఁ గాదనుటేల? వాదు లేల
మఱలిపో నుత్సహింపను మర్త్యలోక
మతిభయంకరమునకు నాయాత్మ సుంత.

వ. పాయక మీయర్చావిధి ధన్యత్వమ్ము గడించుచు నియ్యెడన యుండువాఁడ ననిన విని సమవర్తి యిట్లనియె—

చ. అనఘచరిత్ర! మర్త్యులు గతాయువులీయెడ కేగుదెంచుచుం
ద్రనయముఁ దత్కృతమ్ములు శుభాశుభకర్మములెల్ల రోసి
యే నెనయవు మంచిచెడ్డలు విధించుచునుందు నపక్షపాతబు
ద్ధిన యయి; ధర్ముఁ డంద్రు నను దివ్యులు; పుణ్యము లోక
మిద్ధి సూ.

గీ, తులువలై యుగ్రకర్మముల్ జలుపుకూళ
జనులపాలిటఁ గాలుఁడ, మనుజతతికి

నిరయ మతిఘోర మిదువాఁడ, నిన్నుఁబోలు
పుణ్యజనములయెడ ధర్మమూర్తి నగుదు.

క. సమ లోకపది యీయుర్భా
గ్యము నీ కింకఁ గల దటులుగానఁ జనుము స్వీ
యము నిలయమ్మన కావల
నమలము నీదర్శనమ్ము నవు నా కొసఁగన్.

క. అన యజ్ఞదత్తుఁ డనియె య
మునాసహోదర ! యలభ్యము త్వదంతికమున్
గొన నేఁటిచి యూరక యిటు
చనుపాటిఁడు వెట్టి యున్న జగముల నెంగన్ !

వ. నే మఱలి నెలవు సేరుటయ కర్జమ్మగు నెడ,

క. పొనరిచి యేయేకర్మము
లెనయుదురు నిరయదివమ్ము లెల్లఁబు జీవుల్
నెనరునఁ దెలుపుము ధన్యత
జనికిం గనువాఁడ ననిన శమనుఁడు నుడువున్.

క. పలుకులఁ జేఁతల మనమున
విలసితసద్ధర్మవర్త్మవిముఖిత గడఁగన్
గలనేని రమాపతిపద
ములఁ గొలువనిజడులు నిరయభోక్తలు సూవే.

పారి ననభిజ్ఞత్వావృతి
హరిహరులం ద్రుఘుణునంపు నదుక విభేద
స్ఫురణము హరివిద్యలయెడ
విరక్తులు గుడుతురు నరకపీడ లవేళన్.

నిజకులదేశోచితకృతిఁ
ద్యజియించి విధర్మసంశ్రయాదరమునఁ దా
యజన మెఱుంగక యజియిం
చుజనున్ దూరునతఁ డెనయు సూ నారకముల్.

అలరుచు సమృద్ధవైభవ
కలనం బితృదేవబంధుగణములకున్ బా
ఱుల కిడకయ ధ్వాంక్షముచో
ప్పలయఁ గుడువఁ దొడరునాతఁ డెనయు నిరయమున్.

పొనరిచి పాకవిభేద
మ్ముల నదనున వైశ్వదేవమును సాదమ్మున్
దినునట్టిఁడు నన్యాయ
మ్మున ధనము గడించునతఁడు పొందు నరకముల్.

ధనికులు దంభపరీతులు
ననీశమానులును లుబ్ధు లసహిష్ణువు లం
గన నిర్దుష్టఁ ద్యజించెడు
ప్రణష్టులు కుటిలులు నరకభాజనులు సుమా.

క. ఈయక తా నొకగవ్వయు
నీయం బాల్పడువదాన్య నీనీయనిగో
మాయు ప్రతిములఁ గూర్చియు
వేయేలా, కూర్పఁబడియె వివిధనరకముల్.

క. ధర్మ మధర్మ, మధర్మము
ధర్మము సుమ్మని వివాదతత్పరమతులా
కర్మభ్రష్టులు గాంతురు
శర్మవరా! దుర్గతి యుగసాహస్రమ్ముల్.

క. ఒక్కఁడు పలుకులఁ, జేఁతల
నొక్కఁడు, మదిలోన నొక్కఁ, డొక్కఁడు నగుచుఁ
నక్కవృత్తై చనువారలు
పెక్కేఁడులు కుడుతు రెంతో వెత దుర్గతులన్.

క. ఘనమోహాంధతమమ్మునఁ
గనుఁగవ గనరాక యన్యకాంతలఁ దమి ని
క్కనఁ గ్రక్కున నొక్కెడుపా
పి నిరంతర మొందువాఁడు వెత లిడుచోట్లన్.

క. నిలిచి తులామకరంబుల
నల నల రెడుతటిని దరణి తోడరి త్రిపథగా
దిలసత్తరంగిణుల నఘ
ములు వో మునుఁగనిచె నంటి మొసయు నిరయమున్

క. లివిరి తులువతనమున శం
కువులం బెనుజాల శూలగుల్మినులం దా
రువులం దెరువుల మూయు వ
లువలు గుడుతురు నరకమ్ముల సమలు వేవేల్.

చ. పరముఁ బురాణపూరుషు నపారకృపారసపూరవారిధిం
దరణిశశాంకలోచను విదారితదారుణదేవవైరి శ్రీ
కరు భువనావనప్రవణుఁ గారణకారణు నిర్గుణున్ గుణిన్
హరిని భజింపఁబోనిమనుజాధము లొందెడువారు
దుర్గతుల్.

క. తోలుతం గోని నియమము లా
వల నింద్రియములకుఁ జిక్కి వడి విడనాడం
దలఁపడుజడుఁడును వైష్ణవ
కులమవమంతయు నుడుగక కుడుచు నరకమున్.

క. లలిఁ బాలములఁ దలముల నెల
వుల వృత్తుల నాసలఁ గనఁబో కెట్టిఫల
మ్ములు నుచ్ఛేదన మొనరుచు
ఖిలవృత్తులు నిక్కము నరకమునకు నతిఘుల్.

వ. ఇఁక స్వర్గాపవర్గానాప్తికిం గడుంగడు నర్హులవు మహార్హ
చరితుల తెఱం గెఱింగింతు వినుము.

తే. విష్ణుఁ బ్రభవిష్ణుఁ జిష్ణు రోచిష్ణుఁ గృష్ణు
సర్వకారణు సర్వేశు సర్వమయుని
నాద్యు ననవద్యు నాగమవేద్యు హరిని
సతము భజియించువాఁడెపో స్వర్గగామి.

గీ. విత్తసముపార్జనమ్ము ద్వివిధఫలప్ర
సాధనమ్మును నిజకులాచారధర్మ
తత్పరత మంగళమ్మును ధన్యత జని
కఖిల మచ్యుతపదసరోజార్చనంబ.

క. తెఱనోటిమొక మ్మఱచిన
వెఱచఱచి రయమ్మ పఱచువృకములపెంటికే
కఱివేల్పునకుగుదమ్ముల
కెఱఁగినతోడన తొలంగు నెల్లదొసంగుల్.

గీ. నిగమపఠనపాఠనవిధినిరతి గమురఁ
గలుషములపేరికటికచీఁకటుల కరుణ
కిరణరుచి యచ్యుతార్చ భక్తిని నొసర్పు
వార కాక స్వర్గము సేరువార లేరు!

గీ. వాసుదేవపరబ్రహ్మభవ్యనామ
జపము నేమఱక పొనర్చువిపులమతుల
డాయ వెఱతురు ప్రేతరాడ్భటులు సర్వ
పాపనిష్కృతి విష్ణుసేవన మొకంటె.

క. యాచకు లెవ్వానిఁగూరిచి
చాచి చెయి కనంగలారు సంతస, మేప్ర
జ్ఞాచతురులు దానఫలా
లోచనదూరగు లవారలుం ద్రిదివార్హుల్.

క. యమనియమప్రవణులు వే
దమార్గనిష్ఠితులు తుల్యదర్శిత్వఘనుల్
కమలాధవార్పితాత్ములు
సమనిందాస్తుతులు యతులు స్వర్గాములు సూ.

క. తివిరి మనోవాక్కాయిక
మవుధర్మవునందు శ్రద్ధ యతిశయితముగా
స్వవిహితము విధిని బాయక
ప్రవర్తిలులలితగుణుఁడు సువర్గము నొందుఁ.

క. తనరక నేరు పెవారలు
మనమునఁ గడుపున నుపస్థ మాటలలో నె
క్కొనుచాపల్యముతీవ్ర
మ్ము నడంతురు వారు స్వర్గముం గాంతురు సూ.

క. అరుసము గొనముల, నిగమా
దరము నుడువులందు విలసితమ్మై సతముం
బరమార్థచింతఁ జిత్తముఁ
బరఁగు నెవారల కవారు స్వర్వాసులు సూ.

గీ. మత్సరామర్షమానాపమానలోభ
కామములనుండి సిరి, ప్రాణగణము, విద్య,
మతి, మనమ్ము గాపాడికోఁ జనులయిన
వారు సురలయాతిథ్యము వడయువారు.

గీ. తులువ లనువారికూటమి నలిగి పులుఁగు
మాయఁ బోనిధర్మమునఁ బ్రమాదవశతఁ
జెడనియాత్మ నాస్తుల్లు శిష్టజనులు
వఱలువారు సురాలయావాసకలన.

క. సితమర్ధమునఁ బహునోకఁ డ
వుతిథిం బ్రతిమాసముం గాఁ బొనరిచి విధితో
దితగతి నుపవాసము శ్రీ
పతిపదములు గొలుచునతఁడు స్వర్గాని యగున్.

ఆ. ఎల్లయర్భకులకుఁ దల్లిపోలిక, దివ్య
మౌషధమ్మువిధము సామయులకు,
నిటులు కూర్పఁబడియె నేకాదశీతిథి
యఖిలలోకరక్ష కజునిచేత.

తే. అట్టియేకాదశీతిథి నధికనిష్ఠ
నుపవసించి ముకుందార్చ నొప్పవిపుల
కీర్తి యేకాదశేంద్రియకృతము లఘము
లెడలి పరపద మొందు మహీసురాగ్ర్య!

వ. మహాదానాదిదానమ్ము లఖిలమ్ములు నాకహరివాసర మ్మున కెంచును సరిరావని స్మృతు లుద్ఘోషించు. మఱియు మున్ను సత్యలోకమ్మున

క. పరమేష్ఠి యిదియ తెలియఁగ
హరిదినయజ్ఞాదిభవము లవుధర్మమ్ముల్
చెరియొకదెస నిడి తూఁచిన
బరువయ్యెం దొలిద త్రిదశవర్గము కనఁగాఁ.

వ. విధివిధానమ్మున నుభయపక్షైకాదశీదినమ్ముల నుపవసించి మఱునాఁడు ద్వాదశిలోనన పారణ మ్మొనరింపవలయు; జయయు, విజయయు, జయంతియుఁ, త్రిస్పృశయు, వంజులయుఁ, బక్షసంవర్ధనియుఁ, దిలదుగ్ధయు, నఖండయు, మనోరథయు, భీమపూర్వాయు, నన ద్వాదశి యనేక ప్రకారమ్ముల నిమ్మవు; నాయాసమయమ్ములఁ గల విధి భేద మ్మెఱింగి యనంగజనకు నారాధించు టొప్పు; ని ప్పఁగిది నేకాదశీవ్రతరతులు సయితమ్ము సురపురవరమ సేరనేఱుచువారు.

గీ. తగినవిధి మాహాత్మ్యప్రష్టమా లఱి నెఱింగి
శర్మదము నర్మదాసరిత్సలిలమందుఁ
గలుషసమ్మర్షణ మ్మవగాహన మ్మొ
నర్చువారును జనువారు నాకమునకు.

గీ. ప్రథితగంగాదితీర్థవరమ్ములందుఁ
బుష్కరమునఁ బ్రయాగాది పుణ్యపదము
లందు సహ్యాత్మజాజలమందు స్నాన
తర్పణప్రవణులు స్వ మందంగలారు.

గీ. భూరిభాగ్యైకరాశి శ్రీవారణాసిఁ
బొలుచుమణికర్ణికాతీర్థమునఁ గృతావ
గాహులై విశ్వనాథాంఘ్రికంజములు ద
లంచునంచితుల్ నిర్జరాలయము కాంత్రు.

గీ. నిత్యసత్యవ్రతాచారనియతమతులు
నిత్యతృప్తులు నిర్మముల్ నిర్వికృతులు
సిద్ధ్యసిద్ధుల నొకరూప చెలఁగువా ర
వారి స్వర్గాపవర్గాప్తి వఱలువారు.

దా న ప్ర శం స

వ. అని వెండియు,

క. ఇలఁ బుణ్యపాపభేద
మ్ముల నిరుతెఱఁగులయి కర్మములు పొసఁగించున్
ఫలముల ననుకూలమ్ములఁ;
దొలిది యజన్మము, నితరము దుర్గతి నొసఁగున్.

చ. బల మనివార్యశౌర్య మతిపారము ధీరత వైభవమ్ము ని
స్తుల మవుఁగాక కూలుఁ గృతదోషబలమ్మున నవ్వి యెల్లఁ

గన్నులఁ గనుచుండుటో నన యనూనము లున్నతముల్ మహీ
రుహమ్ములు గిరిమార్గసంస్థములు ప్రోయు చిలం బడవ్రా
మరుద్ధతిన్.

క. దానదయాధర్మాదిక
హీనులు నరకమ్ము లన్న నిఁకఁ దప్పరులా
మానవు లెనయుదురు స్వర్గ మని
యే నుడువఁగవలెనె వేఱె యీడ్యపదాఢ్యా!

చ. అన విని యజ్ఞదత్తవసుధామరసోముఁడు భక్తియుక్తి ని
ట్లను సమవర్తికిన్ గృతశుభాశుభకరమ్ము కారణమ్ముగా
నెనయుట నాకనారకము లెల్ల ఱెఱింగితినీర, కూరిమిన్
వినిచి యనుగ్రహింపఁగదె నే నడుగం దొడఁగొన్న
యర్థముల్.

చ. అరయ దివ్యలోకసాధనము లధ్వరముఖ్యము లిద్ధవైభవుల్
నరపతులట్టివారల పొనర్పఁగ నోపినయవ్వి, ఘోరసం
సరణమహాబ్ధిమున్గి యనిశమ్ముఁ గుటుంబముపోషణార్థ మా
తురులయి గోడు గాంచునలఁతుల్ నరు లీయఁగలారె
దానముల్?

ఉ. హాయనముల్ వెవేలు తిని యాకల ముగ్రవనాంతరమ్ము
లం గాయము కార్శ్యముం గొన నికామము ఘోరము
లౌతపమ్ము లేచాయలఁ జేయ నేరుతురు చంచలచిత్తులు

పాపు లుద్ధతుల్ మాయికు లిట్టివారైన కలిమనుష్యులు
సేరఁగ నాకలోకముల్.

గీ. స్నానసంధ్యాజపమ్ములు జ్వలనుసంను
బ్రేల్మి పఠనపాఠనములు విప్రదేవ
తార్చనమ్ము లెఱుంగనియల్పమతుల
కెట్లు లభియించు సురపద మినతనూజ!

వ. కావున,

గీ. సర్వసామాన్యమై లేక సామ్య మొందుఁ
దక్షిణామ సమృద్ధము ఫలితమ్ము నొసఁగు
వెర వొకండు వచింపుమా ధరణి నెల్ల
నాశ్రమమ్ములఁ బొనరుప నవువిధాన.

గీ. సలిపినంతన యెద్దాని సర్వమయుఁడు
సుప్రసన్నుఁడౌ, స్వర్గాదిసుఖము లక్షు
యతఁ దనరు, దాన తీర్థసేవాదికమ్ము
ఫలము కరగతమ్మగు, నద్ది తెలుపుమయ్య!

గీ. సర్వపాపప్రశమనదక్ష మసమ మ్మ
పారసంసారసాగరోత్తారకమ్ము
తనరునెడ వడి నుడువుమా ధర్మసూక్ష్మ
మమలతరము కలిజనకళ్యాణకరము.

వ. అని తన కెంతయుం బ్రియంబులు స్తుతివాక్యంబుల స్తుతించి ప్రార్థించిన విని క్రందుకొన నమంద మ్మానందమ్ము డెందమ్మున నిఖిలధర్మమర్మజ్ఞుండవు ధర్ముఁ డమ్మహీసురవరున కిట్లనియె —

గీ. అనుగుణమ్ముగ సందర్భమునకు దైవ
తాంతరములఁ బురాణాగమాంశలు విధి
పేర్కొనుఁ బ్రధానములుగాఁగ; విశ్వమయుఁడు
విష్ణుఁ డొకరుఁడ మూలమై వెలయువాఁడు.

గీ. లలిని నగ్నివర్తిస్నేహములును మూఁడుఁ
గలిసి దీపపురూపునఁ బొలుచునటులు
హరిహరద్రుహిణత్రితయమ్ము తనరు
నొక్కరుఁడు విష్ణుఁ డయి. స్వయంజ్యోతి యతఁడు.

క. అనుపమము భక్తిభావ
మ్మున నసయముఁ బూరుషోత్తముం గొలుచునతం
డెనయఁగ నేఅని దొకరుఁడు
వినఁ గన రా డెప్డు విశ్వవిశ్వమునందున్.

వ. అది యటు లుండె,

క. పౌనరుపఁజను ననుదినమును
దనుధారి హితమ్ము గోరి దాన మెదేఁ బా

త్రున కనుచును వాకొను శా
స్త్రనికర, మదియె సుకృతమ్ము సద్వ్రతము సుమీ.

గీ. గణ్య! నిత్యము నైమిత్తికమ్ము కామ్య
మభ్యుదయమయమ్ము పరము మఱఁగ నవస
నేనురీతులఁ దనరారు చూన; మది వి
సువక యొనరు మనతఁడ కా సుకృతి యనఁగ.

గీ. ఎఱిఁగి తమకొలంపు రీయునె ముప్పేళ
లందు ననుదినము నాత్మహితముఁ
గోరువాఁ; డొనర్పఁగారాదు కామ్య మును
కండయేనినాఁడు జ్ఞానసురాగ్య!

క. ఇడఁబో కొఱలకుఁ గాకము
వసువున నొకరుంచ కుసుమఁ బొల్పుగనుముసనిక
దోడరినకినుక నొగ్గతి
నిడుములు కుసుమఁగ సహింతు నేనులు నేవేల్.

వ. మఱియు నట్టికుక్షింభరుల సత్ప్రారోగమ్మున నెండించుటఁ
కాక,

గీ. నిర్ఘృణమ్ము కుండముపై నునిచి యెన్నేని
ద్రవ్యముల్ వోసి పసులచర్మమ్ము చర్మ
కారుఁడ ట్లుపవాసాదికములఁ గ్రుంగఁ
గాయ మనయమ్ము శోధింతుఁ గరుణఁ గనక.

గీ. కడఁగి యుష్ణోదకమ్ములఁ గటుకముల్ క
షాయముల నౌషధీవిశేషప్రయోగ
భేదముల వస్తికర్మల వెంటఁదవిలి
పీడ నొందింతు వైద్యునిజాడ నేన.

వ. తాఁ గనుంగొనుచుండ మనోగతంబులు భోగంబులు భోగించువారలం గని యేపుసూపినసంతానమ్మునఁ దప్యమానుండవుచు నానీచుఁడు దాచికొన్న పెన్నిధానంబుల యనఁజనుదానమ్ములు ము న్నొసఁగరుపకునికి కెంతయుఁ జింతిలి కాలమ్ము గడుపుచుఁ దుదిఁ గాలసర్పమ్మువాతం బడు. నమ్మోయి దినదినమ్మును నియమమ్ము నతిక్రమింపక ముచ్వేళల దీయమానమ్మను దానమ్ము నిత్యమ్ము నాఁబడు.

క. అమరస్తుత్యా! మహాప
ర్వములం దీర్థమ్ములందు వైశాఖాద్యు
త్తమమాసమ్ముల నరద
త్తము చను నైమిత్తికమ్ము దాన మనంగన్.

క. వ్రతసమయమ్ముల, మానస
గతములు వాంఛలు ఫలించుకాఙ్క్ష, శమింపం
దతఖేటోద్ధతి, మానవ
తతి యొసఁగెడునద్ది కామ్యదానము వింటే.

గీ. దేవమందిరధ్వజసంప్రతిష్ఠలందు
జాతకర్మాదులం బెండ్లిసమయమందు
నభ్యుదయ మర్థి సర్థించి యాచరించు
దాన మభ్యుదయాభిఖ్యఁ దనరు నయ్య!

గీ. అడఁగి కలలావు చేవ, స్వాముసుతలు వడ
మిత్తి యెప్పుడో చెప్పక ప్రమింగనున్న
నన్నుఁ గన్న నెఱింగి యీశ్వరసమర్ప
ణమ్ముగా నీవి సరమదానమ్ము సుమ్ము.

చ. కొడుకులు కూఁతులున్ మనుపులఁ గూడుచుకోనమి మిత్తి
వాత నేఁ బడునెడలన్ భరింపఁగలవారు శరీరము లెట్లు;
జీవముల్ వడయఁగ నైనఁ జావు సడి, భాగ్యము భోగ్యము
చూపుమాయ నీపుడునులతోన నెట్లు సుఖముల్ గన
నేరుతు లేమిఁ గ్రుంగుచున్.

గీ. అనుచు నాసలన్ను పెనుత్రాళ్ళచేఁ గట్టు
వడి యొకింత యొదియు విడఁగనేఱ
కనువుదొలఁగు లుబ్ధుఁ డార్జితవిత్తమ్ము
దలఁచి తలఁచి మదిని గలఁత హెచ్చి.

గీ. ప్రేతతృప్తికారణములు విహితదాన
తర్పణస్నానములును శ్రాద్ధములు వదలి

వైతు రవ్వానిసూనులు పంచికొనుచుఁ
గల తలమ్ము పొలమ్ములు గలహావములతో.

గీ. అట్టిలుబ్ధగణము నాఁకలి దప్పిక
యతిశయించి యంగలార్చుచున్నఁ
గరుణఁ గొనక ఘోరనరకకుండమ్ములఁ
గూలఁద్రోతు సమలు కోట్లకొలఁది.

క. కావున శ్రేయోర్థులు ధృత
జీవులమై యున్నయపుడ చేయందగు నా
నావిధములు దానమ్ములు
దేవపదావాసలబ్ధి తిర మద్దానన్.

వ. అంతియగాక భాగీరథియు సరస్వతియు నర్మదయు యము
నయుఁ దాపియుఁ జర్మణ్వతియు సరయువును వేణియుఁ
బూర్ణయుఁ గపిలయు విశల్యయు గోదావరియుఁ దుంగ
భద్రయు గండకియు భీమరథియు బాహుదయు విపాశయు
మున్నగాఁ గలపుణ్యనదీమతల్లులు పవిత్రతీర్థరాజమ్ములు
ననంతఫలప్రదమ్ములు నయి యలరు.

క. తీర్థపతి తీర్థరూపుఁడు
తీర్థఫలప్రదుఁడు విష్ణుదేవుఁడ యవుటన్
దీర్థమ్ములఁ దత్సంస్మృతి
నర్థి నొనర్చుచు మునుంగ నవు శ్రేయోర్థుల్.

క. జలధులు మానసముఖ్యా
మ్మలు సరసులు కుల్యలు ఝరములు పల్వలముల్
ఇలఁ గన్పడునవి యన్నియుఁ
బొలుచు హరిస్మృతి సుతీర్థములగును విప్రా!

క. ఏతత్తీర్థసుసేవా
ధూతమహాపాతకుల యదూరస్థులు వి
ఖ్యాతము నాకనివాసము
సేఁత; కచో, దాసపరులు స్వీయులు హరికిన్.

క. మును సత్త్వరజస్తమములు
గొని గొనములు మూఁడుఁ, గదురఁ గోరిక నారా
యణుఁ డవికల్పుండు సనా
తనుఁడు త్రివిధరూపుఁ డవుచుఁ దనరెను సుగేహా!

వ. అందుఁ దేవలసత్త్వప్రధానుండయి భువనపాలకుండనఁగఁ దా నలువారెఁ; సత్త్వానుప్రాణితరజఃకలితుండయి నాభి కమలమ్మున జగత్సర్జనకృతికిఁ జతుర్ముఖుని నిర్మించెఁ; తమః స్పృష్టతమోధికత్వమ్మున జగత్సంహారకార్యమ్మునకయి త్రినేత్రు రుద్రు జనియింపఁజేసె. అట్లుకావున—

ఆ. కలిగి సత్త్వగుణము కార్యప్రవృత్తుఁడౌ
వాఁడు గాంచు ముక్తిపదము పరము;

రాజసుఁడు శ్రవస్సు, రాజ్యవైభవములు;
తామసుం డథఃపతనము విప్ర!

తే. జగదుదయపాలనప్రణాశనవిధాన
కారణ మనాది పూరుషుఁ గమలనయనుఁ
బ్రీతుఁ జేయ నేర్చునతండు త్రిదివసుఖము
శాశ్వతము నొందు సమయ సంసరణసరణి.

వ. మఱియు

తే. మాధవముపేరిమాస మామాధవునకు
నెంతయుం బ్రియ; మం దొనరించుస్నాన
దానజపముల కశ్వమేధమ్ముఫలము
గలుగు నిక్కువ మండ్రు విజ్ఞులు వరేణ్య!

క. ఇమ్మాసమ్మున విధివిహి
తమ్ముగ ననుదిన ముషస్సుతఱిఁ దీర్థస్నా
న మ్మొనరిచి నియమమ్మున
నమ్మాధవుఁ గొలుచునాతఁ డమరుఁడ సుమ్మా.

తే. దారుణులు నాఁసువరవులఁ దరిమి తరిమి,
తొడరి చిత్రగుప్తుని వ్రాయిఁ పుడిచి తుడిచి,
పుణ్యతీర్థరసమ్ముల మునిఁగి మునిఁగి
పూర్వాపూర్వసముద్ధృతిఁ బొనరుపఁజను.

వ. త్రిపథగా నర్మదా యమునా సరస్వతీ విశోకావితస్తా నదీమతల్లులు వింధ్యాచలము త్తరభాగమ్మునను, గోదావరీ భీమరథీ తుంగభద్రా వేణికా తాపీ పయోష్ణీప్రముఖ పుణ్యప్రవాహినీవతంసమ్ములు తద్దక్షిణమ్మునను, ప్రవహించుచు మంగళతరంగమ్ముల భువనమ్ములు పావనమ్ము లొనర్చుచుండు. మాధవప్రియు మిమ్మాధవమాసమ్మున సనియమ్ముగ ననుదినమ్ము మహానదుల నవగాహనమ్ము నొనరించి యచ్యుతు నర్చించునంచితమతుల కెనయుఫలిత మింతింతయని వచింప నానాలుగు మొగమ్ములవాఁడును నోపఁడు నని వినిచిన విని వినయావనతుండయి యమ్మహీసురుండు మహాత్మా! అట్టు లవునేడ దన్మాసాచరణీయమ్ము మాధవార్చావిధానమ్ము సమగ్రమ్ముగ నెఱిఁగింపవె యని వేఁడిన వేడుక దళుకొత్త సమవర్తి యిట్లని నుడువందొడంగె.

## మాధవపూజాపుష్పాదివర్ణనము

క. దలముల నన్నిటఁ దులసీ
దల మెంతయుఁ బ్రియతమమ్ము దనుజారికి; ని
చ్చలు నేతద్దలసంస్థితిఁ
బొలుచుఁగ దైవములు తీర్థములు సర్వమ్ముల్.

ఆ. మాలతీసుమమ్ము మాటు పాటింపక
సరసిరుహవిచారసరణిఁ దప్పి
తొడరి సంజవేళఁ దులసిదళమ్ముల
విష్ణుఁ గొలుచువాఁడు విష్ణుసముఁడు.

వ. పత్రపుష్పాదికపరికరంబులు దొరుకనితఱి ననంతు నన్నా దులం గొని, కాదేని శాలితండులగోధూమయవప్రభృతుల నయిన నర్చించు టొప్పు. నట్టిఁడు పూరుషుండు కేవల పురుషోత్తముఁడ యగు.

క. హరిభావకల్పి నెవ్వఁడు
పురుషుం డశ్వత్థమూలమున నీ రోసియుఁ
దిరుగుఁ బ్రదక్షిణపరుఁడయి
కరగతము పరమ్ముపదము గన్న నతనికిన్.

క. అరుదార నుదార మ్మా
దర మెస నిమురుచు మోయి మరదలు న్రో నులిక్రొ
బ్బురి పచ్చిక యావుల కిడు
పురుషుఁడు గోలోకవాసముం బొందుఁ జుమా.

తే. వరుసఁ బదుమూఁడు పదునాల్గు పదియునయిదు
నవుదినమ్ముల వైశాఖమాదిపక్ష
మున నెవాఁడు కర్తరితిని బుణ్యనదుల
సలుపు స్నానస, మాతనిపేర్మిఁ దెలియఁగలమె!

వ. అట్టు లమ్మూఁడునాఁడులు నియమమ్మున స్నానాదు లొనరించి తుదిప యను పూర్ణిమనాఁడు

క. తిలదాన మ్మొనరిచి వి
ప్రులు పంద్రెండుగుర రుచిరభోజనసంతృ
ప్తులఁ జలిపెడునాతనిపిత
రు లనశ్వరసుఖము గొందురు సుదివసమునన్.

క. సలలిత మివ్వైశాఖము
తొలిపక్షముతుదిదనాఁడు దొరసినభక్తిన్
జలధేనుపటోపాన
త్ఫలతాంబూలప్రదాత భవము తరించున్.

క. కలిమలశమనార్థము ని
స్తుల యీవైశాఖ సనిచె త్రిలోకిక హరి యి
మ్ముల దద్ధ్రతిలోపక
ఫలితమ్ముగ బ్రహ్మహత్య పఱచు పాపునన్.

వ. ఉదాహరణమ్ముగఁ బురాతనగాథ యొకం డెఱిఁగింతు వినుము.

ధనశర్మోపాఖ్యానము

గీ. మును మధ్యదేశమున బ్రా
హ్మణుఁ డొకరుండు ధనశర్మ యనఁగఁ దనర్చున్

ఘనుఁ డాతఁ డొకదినమ్మునఁ
గొనితేఁ జని యింధనములు కుశలు నడవికిన్,

వ. ఒక్కచోట

గీ. పిక్కటిల దిక్కు లొక్కమా ర్బొబ్బలులటు
బొబ్బలిడుచు దంష్ట్రాభీలముల్ వికృతము
లాననము లొప్పఁ గబళింపఁ బూనువార
పోలెఁ దెఱచి వక్త్రవివరముల్ రయంబ.

వ. అభిముఖులై పయి కుఱుకఁ బఱతెంచుభూతంబులం గని గదిరిన వెఱపునం బాఱుచు వారును వెనువెంటంబడి విడువక యార్చుచుఁ బేర్చువికటాట్టహాసంబులఁ ద్రాసం బినుమడింపంజేయుచుఁ బఱతెంచుటయు నప్పాఱుండు పాఱువాఁడ కొండొకవడి కొకయెడ గడగడ వడఁకిపో వాడలొకమాద్రి నిలువరమ్మున నిలువంబడి దైన్యంబు దోఁప నప్రేతంబుల కిట్లనియె—

గీ. కరుణఁ బూనరయ్య కరము భీతిలి మీఁదు
దరిసెనమ్మకతన దెరు వెఱుఁగక
కుందుచున్నవాఁడ గోవిందమృదుపదా
ర్చనపరుండ లేని బ్రాహ్మణుండ.

తే. ప్రథిత మెవ్వానినామమంత్రమ్ముస్మరణ
మాత్రమునన రూపఱు దుర్దమములు కిల్బి

షములు నారాయణుఁ డనాఁ డొసఁగు సనిద్ర
భద్రముల్ మీరు నను వీడి పనుపవలయు.

గీ. బ్రాహ్మణప్రియుండు బ్రహ్మణ్యుఁ డాపన్న
పక్షరక్షకుండు కృపాపరుండు
ప్రేతమోక్షదాత విష్ణువు బ్రాహ్మణ
ప్రియము సేయువారి పెన్నిధనము.

క. అనుచుం దత్కృతనారా
యణసంస్మరణశ్రవణమహాభాగ్యమునన్
జన నౌద్ధత్యము ప్రేతము
లను నాధనశర్మ కిట్టు లతివినయమునన్.

తే. పరమభాగవతోత్తమ! భవ్యముల్ భ
వత్పదాంభోజముల్ గాంచుపాటినియతి
కూర్చె జనికి సార్థక్యము, ఘోరకిల్బి
షము లెడలె హరినామసంస్మరణకలన.

తే. దూర మొనరించు ఘోరముల్ దురితములు, ప్రో
సంగఁ జేయు శ్రేయము లెందు సమత లేక,
యసము నెసఁగించు, సంసృతి యంతగించు
సరణి బోధించు వైష్ణవసంగమంబు.

తే. ఏపుమాపినతాపముల్ రూపణంపఁ
జాలు చల్లని మధురరసాయనమ్ము

వైష్ణవామృతజ్యోత్స్న యెవారి కొసఁగ
దహరహము నూత్న మాహ్లాద మమలచరిత!

గీ. అనఘ! వినితె యాతఁడు కృతఘ్నాఖ్యుఁ డుగ్ర
పాపపంకప్రలిప్తుఁడు, ప్రతనజన్మ
మున సుదేవాఖ్యశూద్రుఁడు కొనియె నిట్టి
ఘోరరూపము కర్మానుకూలవృత్తి.

గీ. బ్రహ్మహత్యాదిపాపాతిపాపనికర
మునకు, గురుకలత్రాభిగమనమునకును,
దానరోథమ్మునకు నొప్పుఁగాని యొదుఁ
గానరాదు నిష్కృతి కృతఘ్నతకు నంద్రు.

క. వినితే వీఁడు విప్రదైవతుఁ
డను నుల్బణకిల్బిషుండు హరివీరాఖ్యా
నన్నృపోత్తంసుఁడు ప్రాక్తన
జని ననుపమధైర్యవీర్యశౌర్యఘనుండౌ.

క. దిగి నాస్తికవాదమ్మున
భగవత్పూజాదికమ్ము వైముఖ్య మ్మొ
ప్ప గతవ్రీడత యుద్వృ
త్తి గదురఁగ మెలఁగె నికామదృప్తుఁడ యవుచున్.

వ. అట్లు లయజ్ఞపరుండును యజ్ఞధ్వంసకరుండును విప్రజన
దూషకుండును నయి ప్రవర్తించి యిత్తఱిఁ దత్ఫలిత

ముగ నన్వర్థమ్ము నామమ్మున భూతం బయ్యె. నిగె నుల పంకిలమ్మవు మదన్వృత్త మ్మవధరింపుగు.

క. ఆతతగురుశుశ్రూషా
ధీతాగమచయుఁడ మధ్యదేశమువాఁడన్
గౌతమగోత్రప్రభవుఁడ
గౌతముఁ డను పేరఁ బరఁగు బ్రాహ్మణుఁడన్.

గీ. పూని కేవలశ్రౌతమార్గానుగమన
మఖిలకళ్యాణకారణ మనుదురాహా
మాధవధవమ్ము మాధవమాసమందు
స్నానదానాదికమ్ములు సలుపనైతి.

గీ. పాదుకాఛత్రఫలతిలవ్యజన వసన
ముల నొసంగనైతిఁ బ్రమాదమునననేసిఁ,
బెరసి వైశాఖపూర్ణిమ పితృజనులకుఁ
దర్పణాదులఁ దృప్తిని దూర్పకుంటి.

వ. ఎఱిఁగి యెఱిఁగి పరమాంకార పూర్వకమ్ముగఁ బొనరించిన యియ్యఘంబు కారణంబుగా నవైశాఖాభిఖ్య నిగిటిఁ బ్రేత రూపుం గంటిఁ; గంటఁ బడిపెట్టును నడంగని యాంగటయు, దూపయుఁ జుట్టుముట్ట నిరింగూడి యుంగదలిగు నుమ చుంటి. నట్లుగాపునఁ దద్దయుఁ గూరిమి నస్మదుద్దేశమ్ముగ

గీ, విమలగంగాదిపుణ్యతీర్థములయందు
మునిఁగి తిలదానతర్పణమ్ములనొసంగు
మయ్య వైశాఖినాఁడు, చయ్యనఁ గనంగ
లార మద్దాన ముక్తి కల్మష మెడల్చి.

వ. ఇదియెల్లఁ దలనిడుకొని నే శ్రమంపడ నేల యని సంకో చింతువయేని, రయమ్మ పురమ్మున కరిగి

క. ధనశర్మాఖ్యుఁడు నానం
దనున కెఱింగింపుము దయ దయవారఁగ ని
వ్వనమున మాకనువనటలు
పొసరుచు మాముక్త్యుపాయమును వాఁడ వడిన్.

వ. అని నుడివినయంతన

క. లలి సంభ్రమభయదుఃఖ
మ్ములు మేనివడంకుతోడ ముప్పిరిఁగొన వ్యా
కులచిత్తుండయి యిట్టులు
పలికెన్ ధనశర్మ కనుల బాష్పము లుఱలన్.

చ. జనక! యనూనదుఃఖమనుసంద్రమునం బడఁద్రోసి నిన్ను పెన్వనటలపాలు సేసిన యభాగ్యుఁడ యీ ధనశర్మపేరిసీ తనయుఁడు నేన నేఱమిని ధర్మమునూత్మ మెఱుంగఁ గన్నతండ్రిని వగ నుద్ధరింపఁగలరీతినిఁ బోక యలంతి నైతి సూ.

గీ. కడఁగి ధర్మసూక్ష్మ మ్మతిగహన మెఱుఁగ
నేరని స్వపితృనారకోత్తారకుండు
కానిపుత్త్రుఁడు కలిగియు ప్రాణహీనుఁ
డైనమానిసిమాదిరి వ్యర్థుఁడ కద!

క. అరయుం దలి తండ్రియు నిరు
వురు గురువులు పూజ్యతములు పురుషున కందున్
దొరయుం బ్రాధాన్యము పిత
తిరముగ బీజప్రదత్వదృష్టిని దండ్రీ!

వ. ధర్మము నెఱుంగక యజ్ఞానమ్మున నీ కిట్టియుత్కృష్టములం
గూర్చితిఁ బేర్చినకూర్మి మదాచరణీయమ్ము భవన్ముక్త్యు
పాయమ్ము పదేశింపు మప్పగిది ననుసరించువాఁడ నని
వేఁడిన గౌతమప్రేతమ్ము తనపూర్వస్మృతి నారతస్వరూప
మ్మును ప్రేతత్వప్రాప్తియుఁ బహునిదానములఁగాను గలయట్టులు
మహాదరమ్మున నుడివి తుది నిట్లనియె—

గీ. తనయ! కల్మషేంధనకనద్దావపావ
కార్చి, సంసరణద్రుమమహాకుఠార
ధార వైశాఖపూర్ణిమ భూరితరఫ
లదము పితృతృప్తికరము దుర్లభతరమ్ము.

క. పితరులఁగూరిచి యాతటి
సుతు లొసఁగుఫలాన్నదానశుద్ధోదకవ

ప్రతిలవ్యజనోపాన
త్తతి కూరుప నేరుచు ఫలిత మ్మత్యయముల్.

తే. సలిపి శర్మదనర్మదాజలముల నఘ
మర్షణస్నానమును ధరామరులు పసుగు
ర రుచిరాన్నతృప్తులఁ బొనర్పంగ డంగు
వాని పెతరులు నిరయము పడయఁ జనరు.

వ. కావునఁ దనూభవా! రానున్న వైశాఖమ్మున

క. లలిఁ దొలియఱతుదిమూణ్ణా
ళులు గ్రుంకిడి పుణ్యనదులలోఁ దిలదానా
దు లొనర్చి విధివిధాన
మ్మలరఁ, దదీయమ్ము ఫలమ్ము నంతయు మాకుల్,

వ. అప్పటికప్పుడ యర్పణం బొనర్పు మద్దాన మూవురము
మేము ప్రేతకర్మలముక్తులము కానోపువార మనిన వల్లె
యని ధనశర్మయుఁ బురమ్మునకు మఱలి చని దైవప్రాప్త
మ్మగువుమాధవమాసమ్మున,

క. తనజనకుఁడు నుడివినవడు
వునఁ బొనరిచి ఫలము ధారవోసిన యామూ
త్రన యామూవురు దివ్యము
తనువున సురపురి కరిగిరి ధన్యుల మనుచున్.

వ. ధనశర్మయు నపారంబులు నపూర్వంబులు నగు నానాగతమ్ములు భోగమ్ములు గుడిచి తుదిఁ బరమపదమ్ము నందెఁ గావున నో వసుంధరా సుందరా !

తే. మాధవప్రియమాధవమాసమందు
స్నానదానతత్పరతఁ గేశవునిఁ గొలుచు
వారి సుకృతమ్ము లెన్నఁగలార లేరు,
ధన్యు లన వార కద ధరాతలమునందు !

తే. తివిరి మాధవసేవనదీక్షితుండు శ్రీ
లోకపూజ్యుఁడౌ కరుండును లేక యున్నఁ
బుడమి యొక్కఁ బెట్టున ముక్తినేయు నన్న
పాపములఁ బేరిమహాదకూపారమందు.

క. గర్జిలు మించి తపస్యల,
గర్జిలు యోగమ్ము తలను గాలిడి, మిన్నులం
గర్జిలు సర్వోత్తమమయి,
గర్జిలి తర్జించు నిద్ది కాలునిభటులన్.

తే. అనఘ ! యొకఁటి సేసి మహాధ్వరాట
ఫలము, సర్వతీర్థానుసేవననిరూఢి
నెలయు సుకృతమ్ముఁ, గనుఁగొనఁ, నీయరాన్న
నిజము పాలితవైశాఖనియమమునకు.

వ. అని వెండియు దండధరుండు నిండిన నెనరున నవ్విప్రప్రవరున కిట్లనియె.

మహీరథోపాఖ్యానము

చ. కలఁడు మహీరథాహ్వయుఁడు క్ష్మాధవవర్యుఁ డవార్యవీర్య
సంకలితుఁడు శౌర్యధుర్యుఁ, డవికంప్యుఁడు పోర సుధీరుఁ
డయ్యు నయ్యలఘుఁ డమాత్యులం దిడి యనల్పము
రాజ్యభరమ్ము పూవుటమ్ములదొర వాడిచూపు లనఁ
బొల్చు ననుంగు మెఱుంగుబోంట్లతోన్.

గీ. కేవలప్రసవాయుధ కేలికావి
లోల మవుమనమ్మున నిశలుం బవళ్ళు
నెఱుఁగ నేఱక సుంత భోగించె నంచి
తము లనన్యసామాన్యభోగము లభిజ్ఞ!

గీ. తలఁపఁ డరులయుద్ధతి, పుమర్థములజాడఁ
బోఁడు, రాజ్యవిస్తృతిచింతఁ బూనఁ, డింత
సరకుగొనఁ డరాజక మెంత జరిగినను మె
లంగుఁ దనకు నంతిపురికి లంకె వైచి.

వ. అట్లు కొంతకాలము సనినయనంతరంబ

గీ. ఒప్పు నుద్ధతి ధర్మవుచొప్పుఁ దప్పి
తిరుగుపతి లెస్సబోధించి త్రిప్ప నొప్పుఁ

దత్పురోధ, సేయ కటు లాతండును వొగయుం
దత్ఫలము, శిసుకృతము, పితరులునంలె.

తే. వినఁడ యే సంతకుం డాన విభుఁడ యాస్స
భాశుభఫలభాజన మని యాత్మ నెంచి
కశ్యపాఖ్యానకలితుం డాగమవిదీస్య్యం
డమ్మహీరథునిపురోధ యనియె నిట్లు—

ఆ. ఓనరేశ్వర! విను మొక్కఁడు వచియింతుఁ
గోరి నీదుహితము, గురునినుమ్మ
లరయుమయ్య లెస్స, గురునానసేతయే
పరమధర్మ మర్థభాజనంబు.

క. బల మాయువు తేజము ని
స్తులమౌ సామ్రాజ్యలక్ష్మి సుక మశ్వగజా
దులు గుర్వాజ్ఞాపాలన
బలసంప్రాప్యముల సుమ్ము వసుధేశులకున్.

మ. ఘనకామగ్రహసంగృహీతుఁడవ వై క్ష్మాదేవతీర్థానుసే
వనముల్ మానితి, దానవాసన జపానా స్తంభయు య్యెన్,
మహజ్జనసాంగత్య మెఱుంగ వెస్సఁడును గంగా తాక్షసాద
ద్వయార్చనవై ముఖ్యముప్రోవు నీవు భవనా రాశిం దరింతో
యెటుల్ !

తే. స్మరునివిజయధ్వజమ్ములు చకితహరిణ
నయన లెవ్వారలకుఁ గారు ప్రియలు మిపుల?
గంధవహ వేల్లితోల్లోలకదలికాద
లమ్ములట్టులు చంచలల్ సుమ్ము వారు.

తే. భంగతరలతరములు, భ్రూభంగభంగు
రమ్ములు, ముహూర్తపేయముల్, రమ్యము లను
భవములఁ యౌవనమ్ములవలనఁ దృష్టిఁ
గనరు మనుజులు పతనోన్ముఖత్వయుక్తి.

ఆ. తెలివి, కలిమి, బలిమి, తేజమోజమ్ములు
విద్దె, జపము, తపము, వితరణమ్ము,
కులము, నంగనాజితు లవునలంతుల
కున్న నేమి, సమసి చన్న నేమి ?

ఆ. వెంటఁదవిలి యరుగు విధివదాచరితమ్ము
ధర్మ మొకరుఁడ మెయితాల్పుతోడఁ,
బులుఁగు దొఱఁగి తక్కు గలయఖిలమ్మును
సమయు మేనితోన సత్య మింత.

ఆ. పుట్టయట్టు చెదలపురువులు మెలమెల్లఁ
జనును నరుఁడు ధర్మసంగ్రహమ్ము
సేయు; ధర్మనౌక చేదోడుగా సుమ
స్తరము తమము నెల్ల దాఁటవచ్చు.

తే. వాసవోపమ ! మారుతోల్లాసితములు
సాగరోల్లోలకల్లోలజాలములవి
ధానఁ జంచలతమము లెంతేని మనుజ
జీవితస్ఫురణము లని శిష్టసరణి.

తే. రత్నమకుటమ్ము వినయము, నూత్నకుండ
లములు బొంకమి ధర్మమ్ము, లలితకంక
ణద్వయ మ్మీవిగాఁ గల సంద్వ్యయముల
కేల సొమ్ములు జడములు వేలకోలఁది?

ఆ. కాలగతిఁ బొరసినకాత్మలోష్టసమమ్ము
తనువు విడచి మఱలి చనెడువార
బంధుమిత్రపుత్త్రవనితాదు లెల్లఁ బోఁ
దవిలి చనును వెంట ధర్మ మొకఁడె.

గీ. చుట్టి కఫవాతముల్, చెవుల్ చూడ్కి నాయి
కాలుసేతులు తమగతిఁ దూలి జీవి
తము విలుప్తమ కానున్నతఱిని లేచి
కొనుచుఁ జనియెదో యిదియెల్లఁ గనుమ నాథ.

తే. క్షితిపసోమ ! కుటుంబము, కేలుగొన్న
యన్నమిన్న, తనూభవు, లర్థసంచ
యమ్ము, మెయి, యెల్లఁ బరకీయ మస్థిరమ్ము
స్వీయముల్ కృతసుకృతదుష్కృతము లీను.

గీ. ఎదియు నాచరింప నేఱమి వదలి సర్వ
మవశతం బెద్దనిద్దుర నంపు టడఁప
రానియెడ ననర్థకృతాదరమున నేల
విహితధర్మ మనుష్ఠించువేడ్కఁ గనవు?

గీ. దేశనిర్దేశశూన్య, మదిగ్విచార
మన్నపానీయఖిలము, గతావలంబ
మైననిరయాటవీపద్య నరుగ నేర్తు
వెట్టు లొంటిగ విరతి యొకింత లేక ?

గీ. అట్టు లొకరుఁడ వరిగెడునవసరమున
నిన్ను ననుగమించెడు వాఁడ కన్ను వొడిచి
కొన్నఁ గానరాఁ డొనరిచికొన్నపుణ్య
పాపయుగళంబకాక రసాపతిలక !

వ. కావున

క. సతము శ్రుతిస్మృతిసంచో
దితము విహితమ్ము స్వకులదేశోచిత మ
క్షత మెట్లు సదాచారము
నతంద్రితత నాశ్రయింపు మవనీజానీ !

ఆ. విడుచు టొప్పిదమ్ము వడిగ ధర్మువుచొప్పఁ
గడచి చనినయర్థకామయుగళి;

నబ్బు ధర్మమువనన యర్థకామాదిక
సంభవమ్ము సుఖము స్వాతత్రేశ !

ఆ. యోగధారణమ్ము, లోఁగొంట యింద్రియ
గణము నుడుగఁబోనికజ్జ మఖిల
మానవులకు, ధర్మమార్గమ్మునన్ నిల్పఁ
బ్రజ జితేంద్రియుండ వలఁతి రేఁడ !

తే. చకితహరిణేక్షణేక్షణాచంచలములు
వైభవమ్ములు ధర్మతత్పరత మొఱయు
వినయవశముఖ్యసుగుణభూషణుల యయిన
పార్థివులయెడ నిలుచు శాశ్వతము లగుచు.

గీ. కామరోగవశంగతుల్ ఖలులు దర్ప
భీకరవ్రణకిణపరిపీడితావ
యువులు సువిచారదూరులౌ నవనిధవుల
సిరులు తత్ప్రాణములతోడ సరగ నరుగు.

గీ. పెరయఁబోరు వికారమ్ము సిరులు పెరిగి
నం దొఱంగిన ధీరు లెడంపలందు,
వచ్చిచనుధనులతరంగభంగతతిని
గాంచునే హెచ్చుతగ్గులు కడలి సుంత !

గీ. వ్యసననిధనద్వయమ్మున వ్యసన మొర్వ
రానికష్ట మటందురు ధీనిధాను;

లేనయు లోక మథస్తన మేపు దొఱఁగి
వ్యసని, స్వర్గాపవర్గ మవ్యసని సూవె.

వ. అందును

గీ. ఎంత యేని దురంతముల్ హేయకామ
సంభవవ్యసనమ్ము; లసాధుసమ్మ
తమ్ము పతనమూలమ్ము దూరమ్ము ధర్మ
గతికి విడనాడుమయ్య దుష్కామ మధిప!

గీ. అసురసన్నిభు లవివేకు లల్పమతుల
భాగ్యభోగ్యముల్ రాజ్యవైభవము లెల్లఁ
జెల్లు నొకమాఱు తమ చెడు సేఁతవలనఁ
జిచ్చు ముట్టిసకట్టెలమచ్చున నృప !

గీ. కుడుచుతఱిఁ ద్రావువేళల నడచునపుడు
కనులు మూసినవేళ మేల్కొనియ యున్న
సమయమందును సదసద్విచారదూర
మైన మనసువాఁ డసుఱులు లేనివాఁడ.

గీ. తివిరి శ్రుతవంతులకు నుపదేశ మొసఁగు
వేదవిద్వరుఁడు గురుండు నాఁ దలిర్చు;
లోమకల్పము లతనిపలుకుల యథఃప
తనమునకు నున్ముఖ మ్మగు చెనఁటిగమికి.

గీ. విషయరోగమ్ము విముఖతపేరియౌష
ధమున మానిచి స్వస్థచిత్తమ్ము నిల్పి
నేర్పుమెయి వ్యవహృతులందు నగణ్యయుక్తిఁ
బ్రాజ్ఞజనుఁ డర్థసాధనప్రవణుఁ డగును.

గీ. ఎఱిఁగి తఱచి మఱలించుచో హేతుకృతుల
నుండి శుభమట్లు, శుభమునుండి యశుభ
మొనయుచుండు శిశువుచందమున నెడంద,
కాన లోఁగొననౌ బల్మికలిమి చూని.

గీ. ధర్మ మెఱిఁగినవృద్ధులశిక్షణమ్ము
బోధనము విని చెపుత్రోవఁ బోవు మనసు
పేరివార్వము వారించి పెరయు లగ్గు
విషయవాసనాదూరుఁడు విపులకీర్తి !

గీ. ధనము ధాన్యము మిత్రబాంధవగణంబు
హస్తపాదసంచలనమ్ము నన్యదేశ
గమనతీర్థానుసేవనకాయశోష
ణాదు లీవు సౌఖ్యమ్ము విషయార్తమతికి.

వ. కావున

గీ. కాని తెరువునఁ జనుతురగమ్ము కాతు
రీతిఁ జిత్తము లోఁగొన శ్రేయ మఖిల

పించునాతఁడు జతనమ్ము సేఁత లెస్స
వినుము తొలిమెట్టు దానికి విజ్ఞబోధ.

తే. మోహభూతగృహీతుఁడై పోడిమి సెడు
వాఁడు వేఁడిన విజ్ఞులు పరఁగుకరుణఁ
దెలుపువారలు ధర్మవృత్తిరు నట్లు
నడత లెస్స శ్రేయోర్థికి నుడుగఁబోక.

వ. ఎట్టులేని సేమమ్మున కడ్డువడుగామక్రోధమ్ముల సేమమ్ము
గోరుపూరుషుండు కడుంగడుఁ బ్రోఁడతనమ్మున నడంచి
కొనంజను.

తే. కాయమను పేరిఘోరాంధకారబంధు
రమ్ము కందరమునఁ గాఁపురమ్ము సేయు
వైరి సూ కామ, మవ్వానిపాలఁ బడిన
జడుఁడు బ్రదుకనేర్చునె యొకక్షణమయేని.

తే. కనలు కడ లంట మున్ను ముక్కంటి కంటి
కడిఁదిమంటలో బసుమమ్ముగా నొనర్చి
పేర్చెఁ దుంటరి యాతుంటవింటివాని
నయ్యొ నాతఁ డనంగుఁడ యంతనుండి.

తే. నలిపి గిలివెట్టి యలయింపఁ దలఁచు నెడలఁ
బొలఁతికిం బూరుషాకృతిఁ, బూరుషునకు

నిన్నురుబోఁడిపోఁడిమి నాశ్రయించి చెన్నొ
రన కనఁబడు నీ కనరాని పెనుపిసాసి.

తే. అంత నన్యోన్యరూపగుణాదిసంస్మ
రణమునం గొని వెంగలితనము సంగ
దల మునుంగుదురు తరుణి తరుణుఁడు, నిల
స్మరుఁ డటన్న పే రతనికి స్మరణమునను.

ఆ. తనువు లేనివాఁడ తనువు దాల్చినమర్త్య
కోటి నిటులు గోడు గుడువ సడఁచు
చుండఁ దనువు గొన్న నొక్కపెట్టున మన్ను
మిన్ను గ్రుచ్చియెత్తకున్నె వాఁడు !

ఆ. ఎలయు మలినభావ మేవానిసంపర్క
మునన యతిపవిత్రము లవుపంచ
గవ్యములు హవిస్సు కనుమాయు సంతతోఁ
గలఁడె వానికన్న మలినుఁ డొకఁడు ?

ఆ. తాఁ ద్యజించుమలము దనకనుదోయిఁ గ
న్గొనుచు దానికంపు తనదుముక్కు
సోఁకఁ బడుచు మిన్నులఁ జీకాకు లోన నీ
యది విరక్తిఁ బొరయ దాత్మ సుంత.

తే. సురుచిరాన్నపానీయముల్ సొచ్చినయంత
నుదరమునఁ గుళ్ళి పురువుల కునికిపట్టు

పెంటయై తొంటిరూపము విడుచునటులె
తద్రసోపపుష్టమ యవుతనువుగూడ

తే. తఱిని విడనాడి తొల్లిటితనదురూపు
బహుళదుష్కృమిదుర్గంధబంధురమ్ము
దుర్భరము గర్భనరకమందున మునింగి
కుక్కయో పిల్లియో యయి చక్కఁ బుట్టు.

తే. కృమిమయమ్మును గృమిసంభవమును నవుట
నొక్కచోఁ గూడి చెడుకృము లొడలిపైనిఁ
బొటమరించు స్ఫోట మొకండు, పొడమి యడఁగఁ
బోనిదురద లంతటఁ గ్రాచు మేని నెల్ల.

తే. వాయ వాఱిన దోకుడుపాఱలట్టి
గోళ్ళగోకుడుతోఁ దీరి కుమటవడును,
గామకండూతి రేకెత్తి కాముకులకుఁ
గడఁగి నిధువనమ్మున శాంతిఁ గాంచు నటులె.

వ. సురతావసరమ్మున నచోటియనలమ్ము ప్రకోపించి యపానమ్మున మలముం బడద్రోయుఁ, దత్సారభూతమ్ము రసమ్ముద్రిక్తమై వర్తించు.

తే. అల సమానసమాకృష్ట మవుచు సరగ
బ్రహ్మపదమున కరుగు నిర్మలము శుద్ధ

గీ. విషయరోగమ్ము విముఖత సేరి యౌష
ధమున మానిచి స్వస్థచిత్తమ్ము నొప్పు
నేర్పు మెయి వ్యవహృతులందు నెగడుచుండు
ప్రాజ్ఞజనుఁ డర్థసాధనప్రవణుఁ డొప్పును.

గీ. ఎఱిఁగి తఱి మఱలించుచో హేయసుకృతముల
నుండి శుభ మట్లు, శుభమునుండి యశుభ
మెనయుచుండు శిశువుచందమున నెడంద,
కాన లోఁగొనన బల్మికలిమి చాల.

గీ. ధర్మ మెఱిఁగిన వృద్ధుల శర్మదమ్ము
బోధనము విని చెడుత్రోవఁ బోవు మనసు
పేరివార్వము వారించి పెరయు లగ్గు
విషయవాసనాదూరుఁడు విపులకీర్తి!

గీ. ధనము ధాన్యము మిత్రబాంధవగణంబు
హస్తపాదసంచలనమ్ము నన్యదేశ
గమనతీర్థానుసేవనకాయశోష
ణాదు లీవు సౌఖ్యమ్ము విషయార్తమతికి.

వ. కావున

గీ. కాని తెరువునఁ జనుతురగమ్ము నాతు
రీతిఁ జిత్తము లోఁగొన శ్రేయ మఖిల

పించునాతఁడు జతనమ్ము సేఁత లెస్స
వినుము తొలిమెట్టు దానికి విజ్ఞబోధ.

తే. మోహభూతగృహీతుఁడై పోడిమి సెడు
వాఁడు వేఁడిన విజ్ఞులు పరఁగుకరుణఁ
దెలుపువారలు ధర్మవృత్తిరు నట్లు
నడత లెస్స శ్రేయోర్థికి నుడుగఁబోక.

వ. ఎట్టులేని సేమమ్మున కడ్డువడుగామక్రోధమ్ముల సేమమ్ము
గోరుపూరుషుండు కడుంగడుఁ బ్రోఁడతనమ్మున నడంచి
కొనంజను.

తే. కాయమను పేరిఘోరాంధకారబంధు
రమ్ము కందరమునఁ గాఁపురమ్ము సేయు
వైరి సూ కామ, మవ్వానిపాలఁ బడిన
జడుఁడు బ్రదుక నేర్చునె యొకక్షణమ యేని.

తే. కనలు కడ లంట మున్ను ముక్కంటి కంటి
కడిఁదిమంటలో బసుమమ్ముగా నొనర్చి
పేర్చెఁ దుంటరి యాతుంటవింటివాని
నయ్యొ నాతఁ డనంగుఁడ యంతనుండి.

తే. నలిపి గిలివెట్టి యలయింపఁ దలఁచు నెడలఁ
బొలఁతికిం బూరుషాకృతిఁ, బూరుషునకు

నివురుబోఁడిపోడిమి నాశ్రయించి చెన్నొ
రన కనఁబడు నీ కసరాని పెనుపిసాసి.

తే. అంత నన్యోన్యరూపగుణాదిసంస్క
రణమునం గొని వెంగలితనము సంగ
దల మునుంగుదురు తరుణి తరుణులు, నిల
స్మరుఁ డటన్నపే రతనికి స్మరణమునను.

ఆ. తనువు లేనివాఁడ తనువు దాల్చినమర్త్య
కోటి నిటులు గోడు గుడువ నడఁచు
చుండఁ దనువు గొన్న నొక్కపెట్టున మన్కి
మిన్ను గ్రుచ్చియెత్తకున్నె వాఁడు!

ఆ. ఎలయు మలినభావ మేవానిసంపర్క
మునన యతిపవిత్రము లవుపంచ
గవ్యములు హవిస్సు కనుమూయు సంతొంగొ
గలఁడె వానికన్న మలినుఁ డొకఁడు?

ఆ. తాఁ ద్యజించుమలము దనకనుదోయిఁ గ
న్గొనుచు దానికంపు తనదుముక్కు
సోఁకఁ బడుచు మివులఁ జీకాకు లొగ్గ నీ
యది విరక్తిఁ బొరయ దాత్మ నుంత.

తే. సురుచిరాన్నపానీయముల్ సొటిసయాంత
నుదరమునఁ గుళ్ళి పురువుల కునికిపట్టు

వెంటనై తొంటిరూపము విడుచునటులె
తద్రసోపపుష్టమ యవుతనువుగూడ

తే. తటిని విడనాడి తొల్లిటితనదురూపు
బహుళదుష్కృమిదుర్గంధబంధురమ్ము
దుర్భరము గర్భనరకమందున మునింగి
కుక్కయో పిల్లియో యయి చక్కఁ బుట్టు.

తే. కృమిమయమ్మును గృమిసంభవమును నవుట
నొక్కచోఁ గూడి చెడుకృము లొడలిపైనిఁ
బొటమరించు స్ఫోట మొకండు, పొడమి యడఁగఁ
బోనిదురద లంతటఁ గ్రాచు మేనినెల్ల.

తే. వాయ వాటిన దోకుడుపాఱలట్టి
గోళ్ళగోకుడుతోఁ దీరి కుదుటవడును,
గామకండూతి రేకెత్తి కాముకులకుఁ
గడఁగి నిధువనమ్మున శాంతిఁ గాంచు నటులె.

వ. సురతావసరమ్మున నచోటియనలమ్ము ప్రకోపించి యపాన
మ్మున మలముం బడద్రోయుఁ, దత్సారభూతమ్ము రస
ముద్రిక్తమై వర్తించు.

తే. అల సమానసమాకృష్ట మవుచు సరగ,
బ్రహ్మపదమున కరుగు నిర్మలము శుద్ధ

వీర్య; మయ్యాది యెంపును బెరయకునికి
నునికి తగుపాటి దటు నిట్టుఁ జనుచునుండు.

వ. అంతియగాక

ఆ. ప్రథిత! పురువు లేను ప్రాటికోటులగాను
లమ్ములందుఁ గలవు డాగి; యంగ
నుండుఁ జెవుల మొదల రెండు, గనుంగొన
నాశ్రయించి రెండు ననవరతము.

క. తొలిరెండలరుఁ గనిష్ఠాం
గులిపరిమాణమునఁ దోఁకకొన తెలుపుల నై,
నలనవుదోఁకలు వెన్నతో
దులదూగుమెఱుంగెసంగఁ దుదిరెండు దోష్ఫాక్.

క. పింగలి శృంగలి నాఁగ న
సంగుం జుము కర్ణమూలసంస్థములు క్రముల్,
శృంగలి జంగలి నాఁగఁ గ
నుంగవఁ గలయవ్వి వోలుచు నుత్యబలాఢ్యా!

క. కల వట్టివియే వందల
కొలఁది లలాటమ్మునందు గుములు గుములుగా
నలనావాలకు నన్నిటఁ
దులయవు పురువులు విని తె పృథుశ్రవ! యిట్లు.

క. తనరుం బ్రాజాపత్య
మ్మను కృమి యొక్కండు బియ్యమట్టిద రూప
మ్మున నంతియ పొడవున; మో
మున దానికిఁ గలవు రెండు పొడ వయిననెఱుల్.

క. తనయున్నయునికిఁ బాయక
తనమొగమున రసమురూపు తగఁ బడువీర్య
మ్మును జాలఁ గ్రోలి మత్తిలి
ఘన మాక్రిమి కూరుచుఁ వికారము లెన్నేఁ.

తే. తెఱచి దాడలు రెండును దిరుగఁ దొడరు
నప్పు డియ్యది యమ్మోడ నొప్పు మూఁడు
నాడు లిడ పింగలాసుషుమ్నలు జలించి
కలుగుఁ గామకండూతి ప్రాణులకు మివుల.

వ. అంత

తే. తిమురు తలకెత్తగిలి హత్తి స్త్రీపురుషుల
మఱుగుచోటు లుబిసిపడు, మత్తులై మొ
దలిడువారు మారునిఘోరితమును నపుడ
యొఱసికొని మేను లొండొంటి నొదవ హాయి.

వ. అట్లు క్షణమాత్రసుఖ మ్మనుభవించి

తే. మఱలఁ గండూతి, సురతమ్ము, మఱలఁ దొలిద,
మఱల నవలిప్రక్రియ గాఁగ మర్త్యకృము ల

తులకుటుంబజంబాలమందుఁ బడఁగ
లొంగుచుండును మునిఁగి లే కొక్కసిగ.

వ. అట్లు కావున

క. ఓపార్థివ! యివ్విషయ
వ్యాపారపరత్వమునకుఁ బరికింప నొకం
డే పరిపాకము విరస,
మ్మాపద్ధతిఁ జననియతఁడ యంచితమతి యౌ.

తే. కానఁ గామమ్ము సకల నడక గలిగి మనికి,
దరిసినను మిత్తి ధర్మపు దప్పఁ బోవు,
వఱల వినయమ్ము విజ్ఞులపలుకు వినికి,
మహితకీర్తిందిరకుఁ గూర్చు మందిరములు.

వ. అది యటులుండె

తే. ధాత్రిప! కామోపభోగమ్ము కతనఁ గాదు
ముపశమింపఁగఁ బోవ దే పొందు నందు
జాతవేదసుమాదిరిఁ జమురుపోఁత;
దాని నడఁచ నేర్చునవాఁడ ధన్యతముఁడు.

క. రవరవఁ బుంశ్చల్యపహృత
మవుచిత్తముఁ గ్రమ్మఱింప నవునేర్పరి యౌ

భువిఁ గలఁ డెవ్వాఁడు రమా
ధవుఁడు నుమాధవుఁడ కాక ధరణీరమణా !

క. కావున వీటంబుచ్చితి
కేవలకామోపభోగకౢప్తమనమునన్
జీవితమంతయు; వినిపిం
తే వినుము పురోథ నవుట హిత ముత్తమమున్.

తే. సర్వపాపాపనోదనక్షమము మాధ
వప్రియమ్ము మాధవమాసవరము, వఱలి
స్నానదానజపవ్రతాచరణపరత
హరిని సర్చించువా రపు డస్తభవుల.

క. ఎఱుఁగకయ యవుం గాక
త్తఱి నరు లొనరించుస్నానదానాదివిధుల్
అఱుచు నఘంబు లహర్పతి
యిఱుల తెఱంగునన, దీని కెనగా వెవియున్.

మ. అవఘాతమ్మునఁ దండులమ్ము తుష మెట్లట్లే తొలంగున్
సహోద్భవ మహా జీవములంబు సర్వముఁ గనద్వైశాఖ
మాసోత్తమోక్తవిధానాశ్రయణమ్ముకల్మిఁ, గృతతీర్థస్నాన
పూతుండవై యవనీనాథ! రమాధవుం గొలువు ముద్య
ద్భక్తిమై నానెలన్.

ఆ. హస్తనిహితరత్న మను బాసఁ బురుషార్థ
సిద్ధి; బాటు నేర్చి చెలఁగెదీవు
విషయకర్మలన్ను, విను మింక నిష్కామ
మన్నఁ బూర్వకృతము నన్నమునను,

వ. పురోధోవచనమ్ములవియు నావిని మ్ము సుమనస్సుగాఁ దలఁచి
కొని వినయవినమితోత్తమాంగుం డగుచు మహీనాథమహీ
ధవుం డప్పుడ యప్పురోధసు నిట్లనియె —

చ. అనఘవచః ప్రకార ! కలశాంబుధినీరములందుఁ బుట్టువుల్
ఘనములు సాంద్రచంద్రికలకన్న సుధాకరముల్ సువేష్టచం
దనమిహకాతిశీతలగుణమ్ములు నీవచనామృతమ్ములన్
జనవునఁ గ్రోలఁజాలి తొలఁ సంసరణానుశయాగ్నిశాంతి సేకురన్.

చ. అవనధిసంభవమ్ము వ్యసనౌషధ ముల్బణకల్బషాంబుసం
భవభవతాపశాంతికరము మ్మత్రిదశానుదినాస్వ్యమానమున్
నవము భవాదృగీదృశజనానవనాస్పదబుజసంగమమ్ము నాఁ
బ్రవిమలమౌ సుధారస మవారిగఁ గ్రోలుదు సర్వసిద్ధులన్.

తే. మంగళప్రదములు సాధుసంగమాఖ్య
నమరు గంగాతరంగభంగముల మునుక
ఘోరసంసారసాగరోత్తారణాకి
యానిరంతరదృఢనౌక యనఘతిలక !

తే. సమసేఁగాస్త్రైకసుఖలాలసమ్ము మదిని
మున్ను గలభావ, మజ్ఞత విస్మయాంత
మాత్ర తేనియకన్న సుమధురములు భ
వద్వచనములు, ధన్యత వఱలి తిపుడు.

తే. దేహభ స్త్రి బిబ్బోకవతీకటాక్ష
కామమార్గణగణహతి గంట్లువడియె
నెంతలెంతలు కూర్పబోఁ దేచి ప్రసవ
సాయకక్రియాసుఖలాలసత మహాత్మ !

క. నీవివిపింపం బూనిన
పావనవైశాఖమాసభవ్యవిధాన
మ్మోమ్మవిజ్ఞ! తెలిపి వేగమ
ప్రోవఁగదె విపన్ను నన్ను బొరసినకరుణన్.

వ. అని వేఁడుడుఁ గడుంగడు నలరుచుఁ గశ్యపుఁ డయ్యోడ
యని కిట్లనియె—

తే. తెలిసియుండియుఁ దా మపాత్రులకుఁ దనయ
శిష్యులకు నేరికేని వచింపనొప్ప
దపుగఁబడక ధర్మము సూక్ష్మ మడుగకున్న
వలయు శ్రద్ధాళువులకుఁ దెల్పఁగ నటంద్రు.

వ. పురాకృతసుకృతపరిపాకమ్మునఁ నీ వి త్తతిఁ బరిశుద్ధస్వాంతుం
డవు శ్రద్ధావంతుండవు నయి మేఁరమ్మాదరమ్మున వినఁ

గోరితి వంతియగాక పాపావస్థయును, ధర్మావస్థయును, నతీంద్రియమ్మును నన దేహమ్ము గ్రహించినది. అందు నుత్పథగమనప్రవణమ్ము పాపావస్థయును, ధర్మప్రవణపరత వ్రతాద్యనుష్ఠానకుతూహలమ్ము ధర్మావస్థయును, కేవల మపవర్గోన్ముఖ మ్మతీంద్రియమ్మును నా నెసఁగుఁ. బ్రశ్న తమ్మున

తే. పాసి దుష్పాపపంకిలావస్థ నీదు
దేహ మాశ్రయించుట నను, చేటపడఁగ
నిపుడ మద్గీతధర్మ మాలించి మించ
నవుటఁ గాంచె ధర్మావస్థ. నటులు సేసి,

క. తా దొరయుట నాదృతి సం
పాదింప సుకృతఫలమ్ము, వైశాఖస్నా
నాదు లొనర్పించెద నీ
చేఁ దగుతీర్థమ్ములందుఁ జెనకినతమిన్.

తే. అనుచు నుడివి తన్మాసమాహాత్మ్య మెల్ల
నాచరింపించి మించెఁ గశ్యపుఁడవాని
చేత నామని నాతఁడు జివ్వురుదొడుగు
నియతి రేవాజలముల మునింగి కల్య,

సీ. వాసితాఖిలలోక దాసపోషణ శ్రీని
వాస! నీ కిదె కొను మాసనమ్ము,
హృద్యవైదికవచోవేద్యమాహాత్మ్యవై
శద్య! కైకొను మిదె పాద్యజలము,
ధ్యాననిశ్చలమౌనిమానసగోచరా
ఖ్యాన! పంచామృతస్నాన మిదియె,
మోహాంధకారప్రరోహాహారీశ, దు
రూహ! శుద్ధోదవగాహ మిదిగొ,

భావినీసూనశర! కొను వసనయుగము,
స్వజనచందన! చందనచర్చ యిదిగొ,
మేలిరతనాలసొమ్ములజాలు లివిగొ,
కొనుము విరితమ్మిపూలపూజనము దేవ!

తే. అనుచు నర్చించి విధివిధానాంచితముగ
నంచితుం డాతఁ డర్పించె నానృహరికి
క్రమఘుమఘుమవాసనాకలితభక్ష్య
చోష్యమధురనైవేద్యమ్ము శుద్ధవృత్తి.

తే. త్రిదశమండలమస్తకకిరీటకోటి
ఘటితనూతనమణిమాలికామరీచి
నికరనీరాజితచరణనీరజునకు
నెమ్మి నానందనీరాజనమ్ము నొసఁగె.

మెఱుంగక యుత్పథానుగమనపరతం బ్రవర్తిలుట నిరయ
పదపథమ్మున కనతిదూరమ్ముగం గొని చనునవసరమ్మున

ఆ. ఆత్మ వగులం జేయునాక్రందనధ్వాన
మతికరుణము నొడయం డాలకించి
తెలుపరయ్య దానికలరూపుం గతమును
ననుచు వేడ దూత లనిరి పెలుచ.

మ. తమమర్యాద త్యజించి వైచి గతమందాక్షుల్ దురాచారస
క్తము చిత్తమ్మున నెన్ని యే దురితముల్ కావించి కాలోర
గేంద్రమునోటం గబళంబు లైనయనదల్ దా రొందుచు
న్నారు ఘోరము లాదుర్గతు లీడ, నేడుపులయారావమ్ము
సు మ్మిద్దియుల్.

చ. అకట ! సుఘోరనారకము లట్టె తలంచినమాత్ర గుండి
యల్ పికిలి వడంకు పుట్టుం దనువిస్మృతి సంఘటిలున్,
దొలింగు నంబకయుగలంబు డంబు, కొని పాశిభటుల్ చని
పాఱవైవ నెట్టనెలిసి గాగునూ నెలం దలల్ పశుజాతికిం
బ్రేలు బ్రోతలల్.

చ. తలవరు లొక్క చిత్తరువు త్రాటం బిగించి తుపాకిగుండ్ల
తోంబలె గుఱిసేసి చిచ్చుమియుబాణములల్ సముఖాన
నిల్పి కట్టలుక శరీరమెల్ల నుఱులంతలు సేయం బరేతరా

ద్భటుల్ తలఁపడువార లీయెడ సుదారుణమూర్తుల నై
యఘాత్ములన్.

మ. కశలన్ మోదుచుఁ బాశికింకరవరుల్ కాల్సేతులం బట్టి
కట్టి శిర మ్మట్టె విభిన్నమై చెదరునట్లుం గొట్టుచుం దిట్టుచుం
బశుసంఘంబుల నీడ్చి తెచ్చి కృతఘ్నుం బాపమ్ము వల్లెట్లు
చీడ శరీరమ్ములు కోయువారు తునుకల్ గా నుక్కు
అంపమ్ములన్.

మ. శితభల్లంబుల గ్రుచ్చి చిచ్చుపయి సంసిక్తంబుగా నూనె
చే, వెత లార్పుల్ పెనుబొబ్బ లేసుపులు తా వ్యాపించు
కోఁ బోక పాపితనూవ్రాతము పచ్చిమాంస మెటుకుల్
పెన్గం జెలంబోలె నుద్ధతి నట్టిట్టులు ద్రిప్పి కాల్తు రిచటన్
దాక్షిణ్యదూరాత్ములై.

మ. తనచే ముగ్గొని గాసి గానితనుయాత్రాపూర్తిఁ బట్టాగ్నిఁ
గాంచ నిచోఁ జేరినభూతముల్ తమపగల్ స్వాంతమ్ము
నం దెంచి మించినకిన్కం గొలుకం దోలంకొనుచు నిశ్శేష
మ్ముగాఁ దా మయాతనుభాగమ్ములఁ గ్రందమాను లవు
భూతద్రోహులం జూచితే.

మ. శిలపై సమ్మెటపోటులన్ బలిమిమై శీర్షమ్ములన్ నుగ్గు
గాఁ జలుపం బోయెడువార వార లితరస్వ మ్మాసమి

న్మట్ట ద్రుచ్చిలుటన్ శోణితమాంసకీకసయకృత్స్వేదప్ర
దుష్టంబు నిస్తులమౌ నారకమందుఁ బాతితులు గాఁ దో
సేగువారిరు సూ.

చ. వలపు తలిర్చి పేర్చఁ బరభావినులన్ గురుజాయఁ గూర్చు
నెచ్చెలు తెలనాగలం గదియఁ జేరిచి యక్కున నొక్క
నిక్కసఖ్యులుల సుతప్తమౌ నినుపకంబమునన్ బిగి
యించి కట్టి త్రాఁడులఁ గొఱడాలఁ గాలునిభటుల్ మెయి
వాయఁగఁ గొట్టుచుం ద్రిచోన్.

వ. అనుచు నీచందమ్మున నందందుం గల ఘోరనారకకుండ
మ్ములను, నందలివిశేషమ్ములను, గుడుచుజడులను, దెలి
యం జెప్పుచుఁ గలయఁ ద్రిప్పి చూపుచుఁ జనువార
యొక్కచో నొక్కపరి విమానమ్మాపి యాపుండరీకపరి
వ్రాతదూత లాక్షితిపతి కిట్లనిరి—

చ. కనుఁగొనితే నృపాలమణి! క్రన్నన దారుణనారకాళి యా
తనఁ గనువారు పాపపరిదగ్ధులు జీవులు మాధవావగా
హనపరినష్టకిల్బిషుఁడ వర్చ్యపదుండవు నీవిమానపా
వనపవనాంకురమ్ము పయిఁ బర్వ తలిర్చినయంతమాత్రనే,

తే. అలరఁ జల్లనై తప్తతైలాదికమ్ము
లరుసమున నర్తనము సేయు చతిభయంక

రులు జనునివరస్ఫుల కెడ కొలుపుచున్న
వారు వెఱ్ఱి పెంపయొ మొయి వడఁకిఁ బోదగ.

తే. అనిన, నవనీతముంబోలె నగ్గిరి ద్ర
వించి యయ్యంచితులఁ జూచి యుచితములగు
వచనముల మానసమ్ము కృపావనమ్ము
వలికె నారాజపుత్రి దూతలకు నిట్టులు.

గీ. కనిరయేని సుకమ్ము నాకారణమున
ఘోరనారకభోక్తలివ్వారు, నరగు
నఁగొనిపొందు నన్నుఁ జటిలి నరకముకఁ
గాంచి మించఁగలారు లీ రంచితముగ.

గీ. తోడిప్రాణికోట్లు పడుగోడు లడఁపఁ
జాలియును నెవ్వఁ డుద్ధాసఁ బోలుగొనఁడు
కడఁగ వవ్వానిపలలమ్ము గాకకంక
గృధ్రగోమాయువులు ముట్టఁ గెలుతుఘన.

గీ. ఒరులతాపమ్ము చందనతరువులట్టు
లడఁచుటయ పుట్టువులఫలమ్ము యలర్చు
వారు జనని నవనిని బావన మొనర్చ
నోపువారు, తలంప ధన్యులు నవార.

గీ. ఆర్తులార్తిఁ బోకార్పఁ బ్రాణానిలములు
తృణములట్టులు త్యజియించు ధీరమతుల

త్యాగబలమున ధృత యయి తనరు స్థిరత
స్థిర స్థిరతరముల్ శుభ పరంపరలు వఱల.

గీ. ఆర్తసేవాపరాధీనమైనయెడల
నరక మపవర్గవాసజిత్వరము సుమ్ము;
కేవలము స్వసుఖోపార్జనావిధాన
పరము సురమందిరమ్ము దుర్నరకసమము.

గీ. కని కనుంగవఁ బ్రాణివర్గమ్ము వారయు
నుడువఁగా రాని యిడుమల నడుము కట్టి
గట్టిపట్టున నెడసేయఁ గడఁగకున్న
వానిమానస మసితపాషాణకృతము.

క. అన మురమర్దనుపార్ష దు
లని రిట్టులు నారకమ్ము లపవర్గమ్ముల్
గనుచుండు జీవజాలము
తనకృతకర్మానుకూలతన ధరణీధవా !

తే. స్నానదానజపవ్రతసత్యహోమ
పఠనపాఠనవిముఖులు, శఠపరోప
కారదూరు, లుల్లంఘితాచారు లిచట
ఘోరనారకభోక్త లనారతమ్ము.

తే. భూప! పలుకులు వేయేల? పుణ్యకర్మ
విముఖు లెల్లఱు నతిథుల ప్రేతపతిపు.

రమున కేగోల మన కేల? రమ్ము సుఖిగ
రమ్ము హరిమందిరమునకు సమ్మదమున.

వ. అనిన నమ్మహీరథమహీజాని

క. అను నిట్టు లెఱిఁగినంతలొ
యొనరింపం బున్నె మున్ను సురగేంద్రశయనా
నునిపద మవికల్పము గాఁ
జనుభాగ్య మ దెట్టు లొదవెఁ జయ్యనఁ జెపుఁడా.

వ. అనవుడు విష్ణుపార్షదు లిట్లనిరి—

తే. క్షితిప! ధర్మసూక్ష్మమ్ము విచిత్రఫలసి
శిష్ట మజ్ఞేయమై యొప్పుఁ; జేఁత, సేయుఁ
బోమి ధర్మవుఁ దొల్లిటిపుణ్యబలము
నన ఘటిల్లుఁ దఱిని సయత్నమ్ముగాఁగ.

తే. విపులతేజ! విలాసినీంభ్రమాప
హృతము మనమున సుకృత మకృతము నయ్యు,
శౌరిపద మంద నేర్చితి శ్రద్ధ వఱల
మాధవప్రాతరవగాహమహితదీక్ష.

వ. మఱియు నమ్మాధవమాసమ్మున

తే. గురువచఃప్రేరణమున నొనరిచి తీవు
దేవనివహార్చ్యచరణరాజీవయుగలు

నర్చన మ్మది కతముగ హరిపురమున
కరుగుచున్నాఁడ వమరమాన్యత తలిర్ప.

తే. ఘోరసంసృత్యకూపారపారలబ్ధి
కి నెపు డెచ్చోటనేఁ బరికింపరాదు
మాధవుం డొండె మాధవమాస మొండెఁ
గాక వేఱొండు దృఢతరనౌక భూప!

గీ. ఎండుపుల్లల నింగల మెట్టు లట్టు
నిర్దహించు నఘౌఘమ్ము నియమపూర్వ
కమ్ము మాధవమాసకృతమ్ము స్నాన
దానవిధి; తద్విహీనుఁ డమానవుండ.

తే. అశనమై యొప్పుఁ గందమూలాదు లుగ్ర
వనముల ఘనతపోనిష్ఠ వఱలుపరమ
తాపసుల కలభ్యమ్ము మాధవపదమ్ము
మాధవస్నాననిరతుఁడు మనుజుఁ డేనయు.

వ. కావున నెడందం దవులు నివ్వారిం గూరిచిన కొందలముం దిగఁద్రోచి గోవిందమందిరమునకుం బయనమ్ము వేగమ సాగింపు మనవుడు తచ్ఛోకప్రపీడితుండయి దయామయుండు మహీరథమహీధవుం డమ్మహనీయుల కిట్లనియె

క. కలిమికి బలిమికిఁ గీర్తికిఁ
గులీనతకు సుకృతమునకు గుణగణములకుఁ

ముల నుద్ధరించి తుది గోలోక మ్మేనయు; జలాన్నదాన మ్మున వారుణలోకమ్మును, హయదానమ్మున నినపద మ్మును, హేమాదికమ్ముల సురలోకమ్మును, కన్యా ప్రదానమ్మున విష్ణుధిష్ణ్యమ్మును, కరతలామలకమ్ము లవు; నుపస్నాతుండయి విధివిధానమ్మున మాధవాఖ్యానమ్మ మాసమ్మున మాధవు నర్చించునంచితుండు నిరాపదమ్మ హరిపదమ్ము జూఱంగొను. నమ్మహితమ్ము మాసోత్తమ మ్మున

ఆ. కేవలైకఘుస్రకృతము సుకృతమున
కేని నీడురావు దానహోమ
జపతపఃప్రభృతులు స్వవిహితసత్కర్మ
సంచయములు నింత సత్య మధిప!

వ. కావున—

గీ. నెనరు వొదల మిప్పుల నీయొనర్చినయొక
నాఁటిపున్నె మీ యనదలకెల్ల
దారవోయు మిపుడ దానఁ గాంచఁగలారు
వాసి నారకమ్ము స్వర్గసుఖము.

గీ. కడువనేఁజని పెనుకడగండ్లపా లయి
దిక్కు దొఱఁగి యున్నదీనజనుల

కష్టపడెడువాఁడె యనర్ఘజన్ముఁడు
భగవదంశభవుఁడు పావనుండు.

గీ. శ్యేనరాట్ప్రపీడ్యమానకపోతమ్ము
గాచుకొఱకు మున్ను కత్తిఁ గోసి
కండ జీరి కుఱువు కరుణాబ్ధి నిడి శిబి
వఱలుచున్నవాఁడు స్వర్గలక్ష్మి.

గీ. తనదు వెన్ను నెమ్ము దంభోళినిర్మాణ
మునకు వాసవునకు మున్నొసంగి జ
గదుపకారపరత గడుర దర్శించిము
నింద్రుఁ డీడ్యుఁ డయ్యె నెల్లఱకును.

గీ. వింటె భూప! పుడమివేల్పు నొక్కనిఁ గాన
నసువు దొఱఁగి మును సహస్రజిత్తు
నాఁ జిరశ్రవసుఁడు రాజర్షి రాజిలు
చున్నవాఁడు సురలసన్నుతిఁ గాని.

గీ. నరుఁడు వారయఁబోఁడు నాకలోకనివాస
కలనఁ దోడిజీవగణము గుడుచు
నిడుమ లెడము సేఁత నెట్టు లట్టులు నిశ్చ
లమ్ము సుకము నిక్కువమ్ము సుమ్ము.

గీ. అనుడు నుత్సుకమ్ము మనమున మాధవ
వాసరైకకృతము పరమపుణ్య

మర్పణమ్ముసేసె నవ్వారలకు హరి
ప్రీతిఁ గూర్చి యతఁడు ప్రీతిఁ బేర్చి.

వ. అంత

ఆ. నరకమోచనమ్ము వెరసి యవ్వార లె
ల్లఱు మహీరథాచలాతలాధి
నేతతోడఁ బనివినిరి వరవ్యోమయా
నస్థితిం దలిర్చి నాకమునకు.

క. విపులము మాధవమాహా
త్మ్యపిశున మీమహితచరిత మాదృతి నాలిం
చి పఠించి వచించునతం
డపవర్గముఁ గాంచి మించు నస్తభవుండై.

వ. అని వెండియు దండధరుండు యజ్ఞశర్మ కిట్లనియె నట్లు
గావున—

చ. స్వపురము సేర నేఁగి విధివన్మధుమాసనిషేవనావిధా
నపరుఁడవై జగన్మయు ననాము నరూపు ననంతు
నాద్యు నుత్యపదపయోజరాజితు ననంతము భక్తి భజించి
కాంచుమా విపులము స్వీయయుక్తతఁ ద్రివిష్టపసౌఖ్య
మలేఖ్యవైఖరిన్.

మ. అని భక్తిప్రణయమ్ము భావమున సాష్టాంగప్రణామమ్ము
సన్మానిసమ్మాన్యుఁ డతండు సేసి నయనమ్ముల్ మూసి
వైవస్వతుఁ డనులింపం దోఁచినట్లు వాఁడే మఱలన్
వీక్షించునాలోనఁ బేరె నిజామాన మసాధ్య మున్నె
యొకఁ డుర్విన్ దైవప్రుం జేతకున్!

వ. అట్టు లిలుసేరి సముదాయమున సర్వమ్ములుండు యజ్ఞకర్మయు నదియెల్లఁ దలంచి తలంచి యుబ్బుగమ్మునఁ దబ్బిబ్బు లవుచుఁ దన తెలింగెల్లఁ దోడినారల కలించిచి విధివిధానమ్మున ననేకవత్సరమ్ములు మాఘవమాసని షేవనమ్మున నఘమ్ములు దొలంగఁ దుది స్వర్గసుఖసుఖమ్ములందుట కేవల కైవల్యపద మ్మొసఁగె నని వినిచి పండితుఁడు సిండిసయరు సమ్మున సక్కథకుండు శౌనకాదుల కిట్లనియె——

తే. మహితమాధవమాసమ్ము మహిమ యెల్ల
నుడువ నేరుచు నెవఁడు! చెన్నఁడరు నేవల
మొగము లింకొక వేయి పాములమునీఁడు
చాలుఁ దత్కల వివరింప శ్రమకు నోర్చి.

తే. మాధవధవమ్ము మాధవమాస మన్న
మహాదయాస్వాంతపుంబల్మి రహి సెలంగి
కున్న బ్రహ్మాండంబు క్రన్న మునిఁగి
పోవకున్నె పయోధులంబువులలోన.

క. అతులము తన్మాహాత్మ్యము
శ్రుతిమధురము వినఁగ నేర్చు సుకృతయుతుం డ
ప్రతిహత మహాస్తశోక
స్మృతిదుర్లభ మచ్యుతపద మందు దలిర్చున్.

క. అన విని శౌనకముఖముని
జనముఖ్యులు పలికి రిటులు సరసపురాణాం
బునిధిసుధాకర ! నీ వెన
రున విన నేరిచితి మింత రూపఱ నఘముల్.

క. మానుగ శ్రౌతస్మార్తవి
ధానాంచితమైన స్నానదానాదిక మ
న్యానరమానాథపదా
ర్చానిరతి వినితి మెలర్చె జని సార్థకమై.

ఆ. భవికకారణమ్ము భవభయంకరవార్ధి
తారణమ్ము కలుషమారణమ్ము
వాసుదేవమృదులపదయుగధ్యానవి
ధానముఁ వచించి దయ వహింపు.

కృష్ణధ్యానప్రశంస

చ. అన విని రోమహర్షణి ప్రహర్షతరంగిత మంతరంగ మొ
య్యన దయ పేరిసారమున నట్టె సభస్థుల మంట ని ట్లనున్

చ. పొరి సకలర్తుసేవితము, భూజము, విద్రుమపల్లవౌఘసుం
దరతర, ముల్లసన్మరకతచ్ఛదయుక్తము, మౌక్తికప్రభా
కరనవకోరక, మ్మరుణకంజఫలప్రకరావనమ్రముమ్,
దరుణము, కల్పకాభిధము తద్వనమధ్యగ మొక్కఁ డెన్న నౌ

ఉ. ఆమహితమ్ము భూమిరుహముచ్చపునీడఁ బసిండికొండపైఁ
దామరసాప్తబింబ ముదితమ్మయి పొల్చినమచ్చునన్ మణి
స్తోమరుచిప్రరోహపరిశోభన ముజ్జ్వల మారకూటశో
భామిళితమ్ము నూతనము భాసిలు వేది యొకండు చూడనై

ఉ. ఆమణికుట్టిమాంతరగతాయతయోగసుపీఠి నొప్పు సు
శ్రీమహిమాఢ్య మష్టదలజీవనజమ్ము; తదీయకర్ణికా
సీమనివిష్టు, శిష్టజనసేవితపాదు, సముద్యదబ్జమి
త్రామలతేజు, నూర్జితమహాత్త్వు, ముకుందుఁ దెలంపఁగాఁ
దగున్.

మ. బలభిద్వజ్రవిదారితాంజనధరప్రత్యగ్రకాలాభ్రకో
మలనీలాంబుజభాసురాపఘును, శుంభద్బర్హిబర్హావతం
సలసచ్ఛీర్షుఁ, బ్రహర్షితాననను, బ్రవజాబ్జాతాననామానసో
త్పలభృంగమ్ము దలంతు సంతతము నుద్యద్భక్తియుక్తుండ
నై.

మ. భ్రమరోల్లాలితకల్పకప్రసవసౌరభ్యోల్లసన్మాలికా
రమణీయాబ్జభవానివాసమహితోరస్కున్, లతాంతా

స్త్రయుక్తనము, నూత్నోష్ణీషపలకగ్రన్థపూర్ణగాత్రుఁ, జగద్వ్యాలో
లాలకాళిమనోహరనిసునాసాలభాగతిలకోద్దీప్తుఁ భాసితుఁ
మదిఁ.

చ. సరసవిలాసహాసరుచిసంభృతశారదచంద్రసాంద్రికా
సురుచిరతామ్రపూరపరిశోభను, పంకజపత్రనేత్రు, సుం
దరతరచిల్లిచాపజితదర్పకసవ్యధనుర్వికాసు, శ్రీ
కరుఁ, గరుణాకరుఁ, వికచచంపకభాసనాసు, మనంబు
నెంచెదఁ.

చ. నిరుపము, నున్నతప్రహసనిందితశక్రగజాంతికాంసు, సుం
దరమణికంకణాంగదరణత్స్వనహాటకరత్నబాహు, సు
స్థిరమకుటాన్వితుఁ, గనకచేలనిపీతనితంబబింబు, జగ
ధురతరభక్తియుక్తిఁ దలఁతుఁ గణతుం గమలేశసంస్తుతిఁ

తే. అమలమౌక్తికహారతారావళీవి
లసితపీవరోరోద్యుతలప్రభాస
మాననిస్తులకౌస్తుభమణిసుధాంశు
దీపితాశేషభువనునిఁ దెలఁతు హరిని.

తే. నవ్యమాణిక్యముకురాభనఖరరాజ
రాజదరుణాంగులిచ్ఛదనైజపదాంఘ్రి
కోకనదు, సరిదరకేతుకులిశముఖ్య
దివ్యలక్షణలక్షితు, దేవుఁ దలఁతు.

తే. నిఖిలలావణ్యసారవినిర్మితాంగ
యష్టిసౌందర్యవిజితలతాంతచాప
రూపవైభవు, నభవసరోజజాది
దేవనివహార్చ్యచరణరాజీవుఁ గొలుతు.

మ. చెలువౌ నాస్యసరోజపూరితసువంశీరంధ్రలోలత్కరాం
గులులన్ లెస్స సమీరితమ్ము లవుకుల్కుంబల్కులన్
దేనెసోనలమేల్పొతల గోపగోగణమజాండంబున్ విముగ్ధం
బుగాఁ జలుపం జాలినయాలకాఁపరిని సన్త్రాంతమ్ముఁ
జింతించెదన్.

మ. లలితోత్థోభరమందమందగతు లుల్లాసంబు దీపింప, నిర్మల
దంతాగ్రసుదష్టశిష్టతృణరమ్యల్ డాసి త్రోపాడన్రేఁ
పులతో నా లోకఁ జౌచు మోరలును జూపుల్, మూపు
లం దాకఁ దోఁకలు నాసన్ విన వేణుగానరతుఁ డా
కంసారి నాప్రాపగున్.

చ. పొలుపవుమేలిపాలనురువుల్ సెలవుల్ గయిసేయఁ బండు
వెన్నెల లెదిరింపనోపుమెయినిగ్గులు జగ్గులు నిండ వెండిగి
ట్టలు నపరంజికొమ్ములబెడంగుల రంగుసెలంగునాలన్రేఁ
పుల యమునాప్రతీరవనభూములఁ గాచినబాలుఁ డేలు నన్

శా. మారోన్మాదమదస్ఖలత్కలవచోమాన్యల్, శుభల్
లోలకాంచీరాజచ్ఛ్లథమానచీననిచయార్చిర్ద్యోతితాంతస్సర

మ్యోరుస్ఫీతలు ప్రేంతలం గలసి ఖద్యోతాత్మజాతీగకాం
తారాంతస్థుల కేలికానిగతుండా సంయమాత్మజుం గొల్చెదన్.

మ. వ్రజనారీకులలోలనీలనయనవ్యాకోచసంభావితాం
బుజమాలాపరిపూజితాంఘ్రియుగునిం, దనుజప్రత్యగ్రసంహారవి
బ్రజయిష్ణున్ వ్యాసవరోరుహాగ్రపదిగల న్మాధ్వీరసాస్వాదవృ
త్తిజమత్తత్వసమృద్ధచిత్తు, మదిఁ జింతింతున్ రమాకాం
తునిన్.

చ. వలదెస మాను, లింకొకదుభాగమునంగా సనందనాదిపూ
జ్యులు, వెనుకన్ ముముక్షువులు యోగులు, ప్రోల
భుజంగకిన్నరాదులు సధవుల్ సురల్ గొలువన్ దయానిధి
ప్రభవాసహాయుఁడైయుల మణిపీఠిఁ గొల్వమగునచ్యుతు
నచ్యుతభక్తి నెంచెదన్.

తే. శంఖమందేందుసుందరుఁ, జంచలావ
లీపిశంగజటాంచితు, రూపవిభవ
జితసుమాయుధుఁ నాగమసిద్ధు, సిద్ధ
వినుతు వినుతింతు హరిఁ బిరిఁగొనినవిమతి.

క. అని నందనందనుం దన
మనమున ధ్యానించి మించి మనుజేంద్రుఁడు పిదపం
బొనరుపఁ జను విహితముపిధి
కనుకూలముగాఁ దదర్చ యుక్ష్యానులచేన్.

వ. అట్టు లొనరించునంచితుండు కేవలకైవల్యపదప్రాప్తిందనరు నని వినిచి వెండియు సూతుండు.

ఆ. అనఘులార! మీర లడిగినయర్థమ్ము
వ్యాసమునియనుగ్రహమ్మువలనఁ
దెలిసికొనినయంత తెలిపితి నెలసితి
ఫలము పుట్టువునకుఁ బొలుపు గొలుప.

వ. ఇంక నెయ్యది వినవలతు రయ్యది యడుగక యడుగుడు, తొడరినతమి విడువక నుడువువాఁడ ననిన నెసక మెసఁగ విరిసిన యరుసమ్మున మనమ్ము లమ్మునిజనమ్ములు కరకమలమ్ములు ముకుళించి యంచితస్తుతివచనమ్ముల వినుతించి రొమహర్షణీ! యీదృశమ్ములు మాసప్రయుక్తపవిత్ర చరిత్రమ్ములు కృపారసతరంగిత మంతరంగమ్మున వినిపింపం గదె యని వేఁడిన నతండును ధన్యుండ ననుచు వల్లెయని కడుంగడు గుతుకంపడియె.

ఆ శ్వా సాం త ము

క. కొని ప్రకృతిసహాయత స
జ్జనముల ధర్మముల వేదజాలము తేలన్
తనువులు వేవేల్ తమిఁ గై
కొనుహరి శ్రీవేంకటేశుఁ కూరుచుఁ బ్రాపౌ.

మాలిని. కువలయదళనేత్రా, ఘోరదైతేయజైత్రా,
వివిధవినుతిపాత్రా, పీతనానామాంగగోత్రా,
సవననివహరూపా, సజ్జనద్విడ్దురాపా,
ప్రవిహతభవతాపా, భావినీమానచాపా !

ఇది శ్రీ శ్రీవత్సగోత్రపవిత్ర, చిదంబరస్తోత్ర నాగ భూషణసుధీవరపుత్ర శ్రీ బాలాత్రిపురసుందరీగర్భ శుక్తిముక్తాఫలాయమాన ప్రభాకర, లక్ష్మీనరసింహశాస్త్రి సమాఖ్యాన ప్రణీతం బైన కాలభాగవతముద్వితీయస్కంధమునం దృతీయాశ్వాసము సంపూర్ణము.



*          *          *

మ. తెలియఁగా రాని భవన్మహామహిమముఁ ధీగీష్పతుల్
వేదవేత్తలకూర్మిం దెలియంగనై, యితరచింతాదూరులై,
త్వచ్ఛరణ్యులయ్యై నిన్భజియించు సజ్జనులదౌ యోగమ్ము
క్షేమమ్ము నిమ్ముల నీవే వహియించికొందు కరుణాంభో
రాశి, రాధాధవా !

*          *          *

సవరణ

| | | | |
|---|---|---|---|
| 66 | 18 | నరసిం | నరసింహా |
| 125 | 9 | నరసిం | నరసింహా |
| 145 | 10 | రూప్రున | రూపున |

# లక్ష్మీ గ్రంథమండలి,
# తెనాలి.

## సంస్కృత న్యాయములు

ఇందు పండ్రెండువందలకు మించి వైదికలౌకిక పారిభాషికాది న్యాయములు తగు వ్యాఖ్యానముతో క్రోడీకరింపఁబడినవి.

వెల రు 2—4—0.

## తెలుఁగు జాతీయములు

ఇందు మూడువేల తెలుఁగు జాతీయములు సప్రయోగములుగ పొందుపఱుపబడియున్నవి.

## లోకోక్తి ముక్తావళి

ఇందు పదివేలసామెతలు, ప్రయోగములతో నుండును. మూలమూలలనున్న సామెతలన్నియు నెక్కువ ప్రయాసతో నేకత్రితము గావింపఁబడినవి.

## సంస్కృత లోకోక్తులు

లోకోక్తిముక్తావళిలోని తెలుగు సామెతలవలెనే సంస్కృత లోకోక్తు లన్నియు సప్రయోగముగఁ గూర్పఁబడినవి.

# లక్ష్మీ గ్రంథ మండలిలోఁ బ్రకటితములు

గ్రంథకర్త: కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

## మహాభారతరహస్యవిమర్శనము

0—4—0

రచయితలు: **కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి, ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి**

## లక్ష్మీనరసింహస్తవము

ఉత్పలమాలికలు. సకారప్రాసయుతలు చిన్నపుస్తకములందు [illegible]
మాదిరి ముకుటము. 0—0—6

## రామలింగేశ్వర స్తవః

సులభశైలిలో పారాయణమునకనుకూలములగు చిన్న చిన్న
సంస్కృత శ్లోకములు నూటఎనిమిది. 0—1—0

## పుష్పబాణవిలాసము

అవతారిక, నాయిక, నాయకుడు, శృంగారము, ప్రతి
పద్యమున విపులీకరింపబడినవి. 0—2—0

# ఈ కృతికర్తల మఱికొన్ని గ్రంథములు

అచ్చయినవి

ప్రణయగీతాలు

పుష్పమాల

(ఖండకావ్యము)

బాష్పకణములు

(దేశనాయకస్మృతి)

ఆత్మత్యాగి (జతీంద్రుని జీవితము)

(ప్రస్తుతము అచ్చులో లేదు)

కప్పురగిలి

(ద్విపద. ఒక ప్రేమకథ)

శ్రీమద్భాగవతమాహాత్మ్యము

(౪ ఆశ్వాసములు)

దయానందతిమిరభాస్కరము

(ప్రథమభాగము)

(సత్యార్థప్రకాశఖండనము)

రాధామాధవశతకము

ఆంధ్రప్రతిభ

(ప్రథమభాగము)

## అచ్చుకానున్నవి

శ్రీవిద్యాశంకరవిజయము
దయానందతిమిరభాస్కరము
(2, 3, 4 భాగములు)
దయానందమిథ్యార్థప్రకాశము
గణేశపురాణము
మదనకలావిలాసము
భద్రావత్యభ్యుదయము
(హాస్యప్రబంధము)
ఆంధ్రప్రతిభ
(ద్వితీయభాగము)
పురాణములు
భారతీయుల అధోగతి
రామకృష్ణశతకము
నీతిశాస్త్రము
భావదర్పణము
కుందమాల